www.Ramkarri.com

# విజ్ఞప్తి

'లేవండి! మేల్కొండి!' పది సంపుటాలలో వ్యక్తిత్వ వికాసంపై స్వామి వివేకానంద సందర్భోచితంగా వెలిబుచ్చిన భావనల, అభిప్రాయాల క్రోడీకరణే ఈ చిన్నిపుస్తకం. 'సౌశీల్య నిర్మాణంలోను, వ్యక్తిత్వ వికాసంలోను నేటి ఆధునిక యువతకు ఈ చిన్నపుస్తకం అత్యంత దోహదకారిగా ఉంటుంది. సౌశీల్యం, వికసిత వ్యక్తిత్వం ఎంపిక చేసుకొన్న రంగంలో విశిష్టతను సముపార్జించి పెట్టడమేగాక; వ్యక్తిపరమైన, జాతీయపరమైన పురోభివృద్ధికి కూడ తోడ్పడం ఖాయం.

వ్యక్తిత్వ వికాసం, అందుకు దోహదం చేసే విభిన్న అంశాలు ఈ చిన్నిపుస్తకంలో సులువుగా అర్థమయ్యేలా విశ్లేషించబడ్డాయి. 2001వ సంవత్సరంలో మొదటిసారిగా ఈ పుస్తకాన్ని అందించాము. యువతరం నుండి ఈ పుస్తకానికి లభించిన ఆదరణ మమ్మల్ని ఆశ్చర్యచకితులను చేసింది. ఈ ముద్రణలో పుస్తకాన్ని పునఃపరిశీలించి, భావవ్యక్తీకరణ దోషాలను తొలగించి సర్వాంగ సుందరంగా మళ్ళీ మీ ముందు ఉంచుతున్నాం. శక్తిమంతమూ, గంభీరమూ అయిన స్వామీజీ భావాలు విద్యార్థులకు నిత్య స్ఫూర్తిదాయకాలుగా ఉంటాయని ఆశిస్తూ, మేము అందిస్తున్న ఈ పుస్తకాన్ని చదివి ఆధునిక యువత తమ వ్యక్తిత్వాన్ని వికసింపచేసుకోవటానికి, సౌశీల్య వంతులుగా తయారవడానికి ప్రయత్నిస్తే, మా శ్రమకు ఫలితం లభించిందని భావిస్తాము.

**– ప్రకాశకులు**

www.ramkarri.com

www.Ramkarri.com





When the lotus opens, the bees comes of their own accord to seek honey; so let the lotus of your character be full-blown and the results will follow.

పద్మం వికసించినప్పుడు దానిలోని మకరందం కోసం తేనెటీగలు వాటంతట అవే వస్తాయి. అదేవిధంగా మీలోని 'సౌశీల్యం' అనే పద్మాన్ని పూర్తిగా వికసించనివ్వండి. అప్పుడు ఫలితాలు వాటంతట అవే చేకూరతాయి.

www.ramkarri.com

www.Kamkarri.com



# ఉపోద్ఘాతం

## వ్యక్తిత్వం అంటే ఏమిటి?

కేంబ్రిడ్జి అంతర్జాతీయ ఆంగ్ల నిఘంటువు ప్రకారం 'నీ నడవడిక, ఆలోచనా సరళి, భావనలను అభివ్యక్తం చేసేదే నీ వ్యక్తిత్వం' అని అర్థం. సమకాలీన లాంగ్‌మన్ ఆంగ్ల నిఘంటువు, 'ఒక వ్యక్తి యొక్క సమగ్ర స్వభావం లేక నడవడి' వ్యక్తిత్వంగా తెలుపుతున్నది.

ఒక వ్యక్తి వివిధ పరిస్థితులలో ఎలా ప్రవర్తిసాడో, ఆలోచిస్తాడో, భావిస్తాడో, వ్యవహరిస్తాడో అనే విషయాన్ని చాలవరకు నిర్ణయించేది అతడి మనోస్థితే. బాహ్యరూపం లేక వాక్చాతుర్యం లేక హావభావాలు అతడి వ్యక్తిత్వాన్ని కేవలం రేఖామాత్రంగా చూపుతాయి. అవి ఆ వ్యక్తి యధార్థ వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించవు. 'వ్యక్తిత్వ వికాసం' నిజానికి ఒక వ్యక్తి యొక్క ఆంతరంగిక స్థాయిలకు సంబంధించినది. కాబట్టి మనస్సు యొక్క స్వభావం, దాని కార్యకలాపాలను గూర్చిన స్పష్టమైన అవగాహన నుంచి మన వ్యక్తిత్వ అధ్యయనం ప్రారంభం కావాలి.

## మన మనస్సును తెలుసుకోవలసిన ఆవశ్యకత

మనం అనేక పనులు చేయ అభిలషిస్తాం. మంచి అలవాట్లు అలవరచుకో సంకల్పిస్తాం, దురలవాట్లు వదలిపెట్ట నెంచుతాం. ఏకాగ్రతతో అధ్యయనం చేయ పూనుతాం, ఒక ఫలానా పనిని మనోఏకాగ్రతతో చేయ తలుస్తాం. మన

www.ramkarri.com

Www.Kamkarri.com



సంకల్పాలను అమలు పరిచే ప్రయత్నాల నుంచి బలవంతంగా వెనుదిరిగేలా మన మనస్సు తరచు తిరుగుబాటు చేస్తూ ఉంటుంది. మన ముందు ఒక పుస్తకం తెరువబడి ఉంటుంది, మన కళ్లు తెరుచుకొనే ఉంటాయి. కాని మనస్సు కొన్ని గత సంఘటనలలో లేదా భవిష్యత్ ప్రణాళికలను గురించిన యోచనలలో పరిభ్రమింప ప్రారంభిస్తుంది. భగవన్నామాన్ని లేదా భగవన్మూర్తిని మననం చేయటానికి లేదా ప్రార్థించడానికి మనం కూర్చోగానే, కొన్ని నిమిషాలలోనే పై విధంగా జరుగుతుంది.

స్వామి వివేకానంద ఇలా అంటారు–

"స్వేచ్ఛ!... మనస్సును క్షణకాలం కూడా అదుపులో ఉంచుకోలేని, ఒక అంశంపై మనస్సును నిలుపలేని, సమస్తాన్ని వర్జించి కేవలం ఒక్క అంశం మీద క్షణంసేపు కేంద్రీకరింపలేని వారమై ఉండి; మనలను మనం స్వతంత్రుల క్రింద జమకట్టుకొంటాం. ఈ విషయం కాస్త యోచించండి."

క్రమశిక్షణ లోపించిన మనస్సు మన శత్రువుగాను, సుశిక్షితమైన మనస్సు మన స్నేహితునిగాను వ్యవహరిస్తుందని భగవద్గీత పేర్కొంటున్నది. (భగవద్గీత : VI–5,6) కనుక మన మనస్సు యొక్క 'స్వభావం' (Mechanism) గురించిన విస్పష్ట అవగాహన మనకు ఉండాలి. మనకు విధేయంగాను, మనతో సహకరించే విధంగాను దాన్ని సుశిక్షితం చేయగలమా? మన వ్యక్తిత్వ వికాసానికి అది ఎలా దోహదం చేస్తుంది?

www.ramkarri.com

www.Kamkarri.com



## నాలుగు రకాల మనోవిభాగాలు

మనస్సుకు నాలుగు మౌలిక వ్యాపారాలు ఉన్నాయి. వీటిని ఒక ఉదాహరణతో వివరించవచ్చు. దాదాపు పది సంవత్సరాల క్రితం కలుసుకొన్న ఒక వ్యక్తిని నేను కలుసుకొన్నాననుకోండి. ఆ వ్యక్తిని ఎప్పుడు ఎక్కడ కలుసుకొన్నానో, అతడు ఎవరో జ్ఞాపకం తెచ్చుకొడానికి ప్రయత్నిస్తాను. ఈ సదరు వ్యక్తికి సంబంధించిన ఏవైనా సంఘటనలు నా అంతరాంతరాలలో చోటుచేసుకొని ఉన్నాయేమో అని అవలోకించడం తటస్థిస్తుంది. హఠాత్తుగా ఆ వ్యక్తి ఫలానా అని గుర్తుకు వస్తుంది. 'నేను ఫలానా చోటు కలుసుకొన్న ఫలానా వ్యక్తే ఇతడు' అని తెలియ వస్తుంది.

పై ఉదాహరణను విశ్లేషించి మనస్సు యొక్క నాలుగు విభాగాలను మనం గ్రహించవచ్చు –

***1. జ్ఞాపకశక్తి :*** గత అనుభవాల జ్ఞాపకాలు, అనుభూతులు మనస్సు ముందు వివిధ సంభావ్యతలను(possibilities) ఆవిష్కరిస్తాయి. ఈ జ్ఞాపకాల అనుభూతుల సమూహమే 'చిత్తం' అనబడుతుంది. ఈ చిత్తంలోనే మన మంచి–చెడు ఆలోచనల, పనుల ఫలితంగా ఏర్పడిన సంస్కారాలు నెలకొని ఉంటాయి. ఈ సంస్కారాలే మన స్వభాన్ని లేదా నడవడికను నిర్ణయిస్తాయి. ఈ చిత్తమే మళ్లీ మన సుప్తచేతనావస్థగా (sub-conscious) పేర్కొబడుతున్నది.

***2. చర్చోపచర్చలు – భావనారూపకల్పన :*** ఇదమిత్థం కాని స్థితిలో తన ముందు ఆవిష్కృతమైన వివిధ

www.ramkarri.com

www.Kamkarri.com



సంభావ్యతలను మనస్సు పరీక్షిస్తుంది. అది అనేక విషయాలపై పర్యాలోచన చేస్తుంది. మనస్సు యొక్క ఈ సమర్థతను 'మనస్' అని పేర్కొంటారు. ఊహించడం, రూపకల్పనలు కూడ ఈ మనస్ వ్యాపారాలే.

***3. దృఢ నిశ్చయం - నిర్ణయం :*** నిర్ణయం చేసే సామర్థ్యం బుద్ధికి ఉంది. ఏది వాంఛనీయమో దాన్ని బుద్ధి నిర్ణయిస్తుంది. ఒక వ్యక్తిలోని 'విచక్షణాశక్తి' కూడ అదే. వాస్తవికత - అవాస్తవికతల మధ్య, చేయదగిన-చేయదగని పనుల మధ్య, నైతికంగా తప్పు-ఒప్పుల మధ్యగల విచక్షతను అది తెలుపుతుంది. వ్యక్తిత్వ వికాసానికి ఎంతో అవసరమైన 'సంకల్పశక్తి'కి ఆధారం కూడ బుద్ధే కనుక ఇది మనకెంతో ప్రధానమైనది.

**4. 'అహం' భావం :** నేను తింటాను, నేను చూస్తాను, నేను మాట్లాడతాను, నేను వింటాను, నేను ఆలోచిస్తాను, నేను గందరగోళ స్థితిలో ఉన్నాను - ఇత్యాది భౌతిక, మానసిక కార్యరంగాలంలో తనను ఉద్దేశించుకొంటూ ప్రయోగించిన 'నేను'ను 'అహంకారం' అని అంటారు. సుశిక్షితం కాని మనోదేహాలతో ఈ 'అహం' ఎంత వరకు తాదాత్మ్యం చెంది ఉంటుందో, అంతవరకు ప్రపంచంలో జరిగే సంఘటనల, పరిస్థితుల చెప్పుచేతల క్రింద మానవ జీవితం ఉంటుంది. అంతేగాక ప్రీతికరమైన సంఘటనలతో ఆనందం పొందుతూ, ప్రతికూలమైన వాటితో దుఃఖపూరితం అవుతుంటుంది. మనస్సు నిర్మలం,

www.ramkarri.com

www.ramkarri.com



సుశిక్షితం అయ్యేకొద్దీ మనిషి అహంకారం యొక్క నిజమైన మూలం తెలుసుకోగలుగుతాడు. తదనుగుణంగా అతడు దైనందిన జీవితంలో సమతౌల్యతను సంతరించుకో గలుగుతాడు. ఆపై అటువంటి వ్యక్తి ఏవిధమైన సంఘటనల, పరిస్థితుల ప్రభావానికి కూడా లోనుకాడు.

మనస్, బుద్ధి, చిత్తం, అహంకారం అనే మనస్సు యొక్క నాలుగు విభాగాలు భిన్నంగా అనిపిస్తున్నప్పటికి, అవి వేరు వేరు కావు. అవి నిర్వర్తించే కార్యకలాపాల మేరకు విభిన్న నామాలతో అదే మనస్సు పేర్కొనబడుతుంది.

## మనస్సు గురించి ఇంకా...

కఠోపనిషత్తు(3.3.9) మానవ వ్యక్తిత్వాన్ని రథం ఉదాహరణతో వివరిస్తుంది.

రథంలో ప్రయాణించే యజమాని మన 'అహం'నకు ప్రతీక.

రథం 'దేహం'ను సూచిస్తుంది.

రథసారథి 'బుద్ధి'కి ప్రాతినిధ్యం వహిస్తాడు.

కళ్ళాలు 'మనస్'ను సూచిస్తాయి.

గుఱ్ఱాలు జ్ఞానేంద్రియాలుకు❀ ప్రాతినిధ్యం వహిస్తాయి.

రథం పయనించే బాట 'విషయ వస్తువులు'కు ప్రతీక.

---

❀ **జ్ఞానేంద్రియాలు :** మనిషికి లోకంలోని వస్తువుల గురించిన జ్ఞాన–అనుభవాలకు కారణమైన చెవులు, చర్మం, కళ్లు, నాలుక, ముక్కు అనే ఐదింటిని జ్ఞానేంద్రియాలు అంటారు.

www.ramkarri.com

www.Ramkarri.com



ఈ మనోదేహ వ్యవస్థతో తాదాత్మ్యం చెందిన వ్యక్తి ఆ వస్తువులను లేదా కర్మఫలాలను అనుభవిస్తున్నాడని చెప్పవచ్చు.

రథానికి పూన్చిన గుఱ్ఱాలు శిక్షణ పొందినవి కానప్పుడు, లేదా సారథి నిద్రకు ఉపక్రమించినప్పుడు రథం గమ్యాన్ని చేరుకోలేదు. పైగా రథం బోల్తాపడి యజమాని మరణానికి కూడ దారితీయవచ్చు. అదే విధంగా ఇంద్రియాలు క్రమశిక్షణను కోల్పోయినప్పుడు, నిత్యానిత్య వివేకం నిద్రాణంలో ఉన్నప్పుడు మానవజీవిత గమ్యాన్ని ఎవరూ చేరుకోలేరు.

అందుకు మారుగా గుఱ్ఱాలు శిక్షణ పొందినవి అయినప్పుడు, రథసారథి మెలకువతో ఉన్నప్పుడు రథం గమ్యాన్ని చేరుకొంటుంది. అట్లే బుద్ధి వికసించి ఉన్నప్పుడు; మనస్సుతోసహా ఇంద్రియ వ్యవస్థ సుశిక్షితమై, తన అదుపులో ఉన్నప్పుడు మనిషి జీవిత లక్ష్యాన్ని సాధిస్తాడు.

ఆ లక్ష్యం ఏమిటి?... దాన్ని గురించి ఇక ముందు తెలుసుకోనున్నాం.

వ్యక్తిత్వ వికాస సంబంధమైన మనస్సు యొక్క మరో ప్రధాన కార్యకలాపం మన 'భావోద్వేగాలు'. భావోద్వేగాలు ఏ మేరకు అదుపులో ఉంటాయో ఆ మేరకు ఒక వ్యక్తి స్వభావం ఆరోగ్యదాయకంగా ఉంటుంది. భావోద్వేగాలను స్థూలంగా రెండు కోవల క్రింద వర్గీకరించవచ్చు – ఆకర్షణ, వికర్షణ.

www.ramkarri.com

www.Ramkarri.com



– ప్రేమ, మెచ్చుకోలు, అభిలాష, సానుభూతి, ఆనందం, ఆదరణ, అభిమానం మొదలైనవి 'ఆకర్షణ'ను సూచిస్తాయి.

– ద్వేషం, క్రోధం, భయం, విచారం, అసూయ, చిరాకు, అవమానం ఇత్యాదులు 'వికర్షణ'కు సూచకాలు.

మనస్సు సుశిక్షితంకానంత వరకు ఎవరి వ్యక్తిత్వమూ వికసించదు. భావోద్వేలను నియంత్రించి, మనస్సును నిమ్నస్థాయి నుండి ఉన్నత స్థితులకు తీసుకు వెళ్ళడానికి సమర్థవంతమైన 'స్వీయవికాస ఉపకరణంగా' సారథి అయిన బుద్ధి మనకు ఉపకరిస్తుంది.

## స్వభావం అంటే ఏమిటి?

మనం చేసే ప్రతి పని, ఆలోచన మనస్సులో ఒక సంస్కారాన్ని వదలిపెడుతుంది. ఈ సంస్కారాలు ఒక ఫలానా సమయంలో మనం ఎలా ప్రవర్తించాలో, ఒక ఫలానా పరిస్థితికి మనం ఎలా స్పందించాలో నిర్ణయిస్తాయి. మనస్సులో పాదుకొన్న ఈ సంస్కారాల పూర్తిమొత్తం మన స్వభావాన్ని నిర్ణయిస్తుంది. గతం, వర్తమానాన్ని నిర్ణయిస్తుంది. అలాగే మన ప్రస్తుత ఆలోచనలు, చేతలు మన భవిష్యత్తును రూపుదిద్దుతాయి. ఇదే వ్యక్తిత్వ వికాసంలోని కీలక సూత్రం.

## మనోదేహ వ్యవస్థను చైతన్యవంతం చేసేది ఏది?

ఇది ఎంతో ముఖ్యమైన ప్రశ్న. మనలను గురించి చక్కగా తెలుసుకోవడానికి దీని జవాబు దోహదం చేస్తుంది. ప్రాచీన భారతీయ ఋషులను, మునులను ఈ ప్రశ్న

www.ramkarri.com

www.Ramkarri.com


ఎంతగానో ఆకట్టుకుంది. వారు తమ జ్ఞానేంద్రియ, మానసిక ఉపకరణాల ద్వారా ప్రయోగాలు సలిపి, నియమబద్ధ అన్వేషణ జరిపి చివరకు జీవునిలోనే దివ్యత్వం ఉన్నట్లు కనుగొన్నారు. ఆ దివ్యత్వం చేతనే మనస్సు గ్రహిస్తుంది, కన్ను చూస్తుంది, చెవి వింటుంది, జిహ్వ మాట్లాడుతుంది (కేనోపనిషత్తు I–1,2). వాస్తవానికి మనలో 'అహం'ను నియోగించే ఈ దివ్యత్వమే మన వ్యక్తిత్వంలోని నిత్యమైన మూలపదార్థం. ఈ దివ్యత్వం భౌతికశరీరం పతనమైన తరువాత కూడా నిలిచి ఉంటుంది. మనం దేహ-ఇంద్రియ-మనో వ్యవస్థతో తాదాత్మ్యం చెంది ఉన్నంత వరకు ఈ దివ్యత్వం మనలో గర్భితంగా ఉండిపోతుంది. శాస్త్రాల, మహాత్ముల వచనాల ప్రకారం ఈ గర్భితమైన దివ్యత్వాన్ని అభివ్యక్తం చేయడమే మానవ జీవిత పరమావధి.

## వివేకానందస్వామి సందేశ సారం ఏమిటి?

వివేకానంద స్వామి ప్రసంగాలు, సంభాషణలు, లేఖలు, పద్యాలు యావత్తు 'లేవండి! మేల్కోండి!' పేరిట ప్రచురితమైన పది సంపుటాలలో ద్యోతకమయ్యే స్వామీజీ సందేశసారం ఏదైనా ఉందా? ...దీన్ని గురించి స్వామీజీ పలుకులనే ఆలకించండి –

> "నా ఆశయాన్ని నిజానికి కొన్ని మాటల్లో చెప్పవచ్చు. అది– మానవులకు వారిలోని దివ్యత్వం గూర్చి బోధించి, వారి జీవిత ప్రతి కార్యకలాపంలోను దాన్ని ఎలా అభివ్యక్తం చేయాలో ప్రబోధించడమే."

www.ramkarri.com

www.Ramkarri.com


"మానవునిలోని స్వతస్సిద్ధమైన దివ్యత్వమే" స్వామీజీ సందేశ సారాంశం.

ఈ క్రింది స్వామీజీ విఖ్యాతవచనాలే మన వ్యక్తిత్వ వికాసానికి తారకమంత్రం–

"ప్రతి జీవిలోను దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఈ దివ్యత్వాన్ని, బాహ్య–అభ్యంతర ప్రకృతులను నియంత్రించి, అభివ్యక్తం చేయడమే జీవిత పరమావధి."

స్వతఃసిద్ధమైన 'దివ్యత్వ–పరిపూర్ణత'లను జాగృతం చేసుకోవడంలో, మనల్ని ప్రేరేపించడానికి స్వామీజీ ఎన్నడూ అలసిపోలేదు. మన దైనందిన జీవితంలో ఈ దివ్యత్వం అభివ్యక్తం కావాలని ఆయన ఆకాంక్షించారు. నిజానికి మానవ నాగరకతకు ఈ దివ్యత్వ అభివ్యక్తీకరణే ఏకైక సూచికగా ఆయన పరిగణించారు.

"ఒక జాతి సముద్రాలను అతిక్రమించవచ్చు, పంచభూతాలను వశపరచుకోవచ్చు, భౌతిక విషయాలను ఉన్నత స్థాయికి పెంపొందించవచ్చు. కాని ఎవడు స్వార్థాన్ని జయిస్తాడో అటువంటి వ్యక్తిలో విలసిల్లే నాగరకతే అత్యున్నతమైనదని గుర్తించకపోవచ్చు."

"విశ్వం ఒక పెద్ద వ్యాయామశాల. మనం అందులో వ్యాయామం చేస్తున్నాం. ఈ వ్యాయామ ఫలితంగా మనం దేవతల మవుతాం. మన సకల ప్రయత్నాలు ఈ దివ్యత్వాన్ని అభివ్యక్తీకరించేవిగా ఉండాలి. నాగరకత అంటే ఆ దివ్యత్వ అభివ్యక్తీకరణే."

www.ramkarri.com

www.Kamkarri.com



శాశ్వతమైన ఉనికి , శాశ్వతమైన జ్ఞానం, శాశ్వతమైన ఆనందం యొక్క భండారమే మనలోని ఈ దివ్యత్వం. ఈ దివ్యత్వ అభివ్యక్తీకరణ జరిగేకొద్దీ శాశ్వత ఆనందాన్ని చవిచూస్తాం, ఉత్కృష్ట జ్ఞానాన్ని సంతరించుకొంటాం.

**సంకల్పశక్తిని సుదృఢ పరచడమే,**
**వ్యక్తిత్వ వికాసంలోని సారాంశం**

మన వ్యక్తిత్వంలోని దివ్యత్వ అంతర్భాగాన్ని ఐదు పార్శ్వాలు(dimensions) ఆవరించి ఉంటాయి. అవి–

***1. భౌతిక పార్శ్వం :*** ఇందులో శరీరము, ఇంద్రియాలు ఇమిడి ఉంటాయి.

***2. శక్తి పార్శ్వం :*** జీర్ణక్రియ, రక్తప్రసరణ, శ్వాసక్రియ ఇత్యాది దైహిక కారకలాపాలను నిర్వర్తిస్తుంది.

***3. మానసిక పార్శ్వం :*** ఆలోచనలు, భావనలు, ఉద్వేగాలు మొదలైన మానసిక కార్యకలాపాలను చిత్రీకరిస్తుంది.

***4. బౌద్ధిక పార్శ్వం*** *(intellectual dimensions)* ***:*** ఒక వ్యక్తి లోని నిర్ణయాత్మక సమర్థతే ఈ పార్శ్వం. సంకల్పశక్తికి, వివేచనకు ఇది ఆధారంగా వ్యవహరిస్తుంది.

***5. పరమానంద పార్శ్వం :*** అనిర్వచనీయమైన పరమానంద అనుభూతికి సంబంధించిన పార్శ్వం.

భౌతిక పార్శ్వం స్థూలమైనది. శక్తి పార్శ్వం భౌతిక పార్శ్వం కన్నా సూక్ష్మమైనది. ఈ క్రమంలో పరమానంద పార్శ్వం అన్నింటి కన్నా సూక్ష్మాతి సూక్ష్మమైనది.

www.ramkarri.com

www.ramkarri.com



మనస్సును ఉత్తమ(సూక్ష్మ) పార్శ్వం ఆవరించి ఉండటమే వ్యక్తిత్వ వికాసాన్ని సూచిస్తుంది. ఈ ప్రకారంగా చూస్తే... భౌతిక పార్శ్వంలోనే ఒక వ్యక్తి మనస్సు నెలకొని ఉంటే, అతడు ఇంద్రియ సుఖదుఃఖాలకు అతీతంగా లేని పశువు దశలో జీవిస్తున్నాడని అనాలి.

కోరికల, పాత అలవాట్ల, చెడు సంస్కారాల, ఉద్వేగాల ప్రభావాలకు స్థానమైన నిమ్నస్థాయి మనస్సుతో చేసే పోరాటమే వికాసం.

మన వివేచనను(బుద్ధి) ఉపయోగిస్తూ నిమ్నస్థాయి మనస్సుతో ఎంత తక్కువగా తాదాత్మ్యం చెందుతామో ఆ మేరకు మన వ్యక్తిత్వం వికాసం చెందుతుంది. అందు నిమిత్తంగా మనస్సు పదే పదే ప్రయత్నించి, దాని పాత అలవాట్లతో పోరాడి, కొత్త ఆరోగ్యకరమైన అలవాట్లను అలవరచుకోవాలి. తత్ఫలితంగా మనలోని దివ్యత్వం అభివ్యక్తమౌతుంది. అందుమూలంగా మనలో గర్భితంగా ఉన్న పరిపూర్ణత కూడా అభివ్యక్తమై, మనలను నిజమైన నాగరకులగా చేస్తుంది. కాబట్టి ఈ పోరాటం మహోత్కృష్టతను సంతరించుకొన్నది .

## వ్యక్తిత్వ వికాసం – ఆవశ్యక లక్షణాలు

**ఆత్మవిశ్వాసం :** "మనలో గర్భితంగా ఉన్న దివ్యత్వం పట్లగల దృఢ విశ్వాసమే వ్యక్తిత్వ వికాసానికి మూలాధారం" అని స్వామి వివేకానంద పేర్కొంటారు. ఆత్మవిశ్వాసం కలిగిన

www.Ramkarri.com


తరువాతే భగవంతునిపై విశ్వాసం కలుగుతుంది. తన స్వరూపం ఈ మనస్సు-శరీరం కాదనీ, ఆత్మే తన యథార్థ స్వరూపం అనీ విశ్వసించినప్పుడు, ఆ వ్యక్తి సౌశీల్యవంతుడై శ్రేష్ఠతమ వ్యక్తిగా రూపొందుతాడు.

***అవ్యతిరిక్తంగా** (positive) **ఆలోచించడం :*** మానవులలోని దుర్బలతను స్వామి వివేకానంద చెడామడా తెగనాడారు. సౌశీల్యానికి 'అవ్యతిరిక్త'మైన ఆలోచనలు అతి ప్రధానమైనవి. ఈ అవ్యతిరిక్త లేదా ఆర్యోకరమైన ఆలోచనలకు మనలో గర్భితమై ఉన్న దివ్యత్వమే ఆధారం. "మంచినే చేస్తూ ఉండండి, సదా పవిత్ర భావాలనే ఆలోచిస్తూ ఉండండి, దుష్ట సంస్కారాలను నిరోధించే మార్గం ఇదొక్కటే. మంచి అలవాట్లను అలవరచుకోవడం ఒక్కటే వ్యక్తిత్వాన్ని చక్కబరచుకొనే మార్గం". తననుగాని, ఇతరులను గాని దుర్బలులని భావించడమే మహాపాపంగా స్వామి వివేకానంద ఉద్ఘాటిస్తారు.

***వైఫల్యం, పొరపాట్ల పట్ల వైఖరి :*** వెయ్యిసార్లు పరాజయం పొందనా సరే, తన ఆదర్శాన్ని వదలిపెట్టరాదని స్వామి వివేకానంద బోధించేవారు. అసత్యం పలుకలేని ఒక గోడగా, ఒక జడంగా ఉండడం కంటే పొరపాట్లు చేస్తూనే, ఆ పొరపాట్ల ద్వారా నేర్చుకోవడాన్ని స్వామి వివేకానంద హర్షించేవారు.

***స్వకీయ ఆసరా :*** మనిషి తన విధికి తానే కారకుడు అని అంటారు స్వామి వివేకానంద. 'మన ప్రస్తుత స్థితికి మనమే

www.ramkarri.com

www.Ramkarri.com



బాధ్యులం. మనం ఏం కావాలని కోరతామో ఆవిధంగా అవడానికయ్యే శక్తి మనలోనే ఉంది. '

**త్యాగం - సేవ :** వ్యక్తిత్వ నిర్మాణంలో నిస్వార్థ సేవ సర్వోచ్ఛ సాధనమని స్వామి వివేకానంద ఉద్ఘాటించారు. నిస్వార్థపరత, కర్మఫల ఆకాంక్షల పరిత్యాగమే మన దేశంయొక్క ఆదర్శద్వయంగా స్వామి వివేకానంద అభివర్ణించారు. "ఆ మార్గాల్లో దేశాన్ని శక్తివంతం చేస్తే, తక్కినదంతా దానంతట అదే జరిగిపోతుంది" అని అన్నారాయన.

**ఈ చిన్ని పుస్తకం గురించి**

పది సంపుటాల స్వామి వివేకానంద సాహిత్యసర్వస్వమైన 'లేవండి! మేల్కొనండి!'లో పరివ్యాపించిన వారి ఆశయాల, ఆదర్శాలను పాఠకులకు సుపరిచితం చేయడానికి చేసిన ప్రయత్నమే ఈ చిరుపుస్తకం. ఈ చిన్ని పుస్తకం చదవడం స్వామి వివేకానందులను, ఆయన రచనలను అధ్యయనం చేయడానికి యువతకు స్ఫూర్తిని కల్పిస్తుందనీ, తద్వారా శీలాన్ని, వ్యక్తిత్వాన్ని వికసింప చేసుకోవాలనే ఆకాంక్ష వారిలో జాగృత మవుతుందనీ మేం ఆశిస్తున్నాం. సౌజన్య శీలమూ, వ్యక్తిత్వ వికాసము తాము ఎంపిక చేసుకొన్న రంగంలో ఉత్కృష్టతను సంతరింప చేయడమేకాక, వ్యక్తిపరంగాను జాతీయపరంగాను పురోగతికి దోహదం చేయడం తథ్యం.

www.ramkarri.com

www.Kamkarri.com



స్వామి వివేకానంద ఇలా వక్కాణిస్తున్నారు–

"మీ సత్యస్వరూపాన్ని మీరు తెలుసుకోండి.

ప్రతి వ్యక్తికి అతడి స్వస్వరూపం ఏదో తెలుపండి!

నిద్రావస్థలోని జీవుని ఎలుగెత్తి పిలవండి!

ఓహో! అతడెలా మేల్కొంటాడో మీరే చూద్దురుగాని.

ఆ సుప్తజీవి మేల్కొని స్వస్వరూప జ్ఞానంతో కార్యతత్పరుడు అయినప్పుడు అతడిలో శక్తి జనిస్తుంది, తేజస్సు వస్తుంది. శుభం కలుగుతుంది. పవిత్రత కలుగుతుంది. ఉత్కృష్టమైనది యావత్తు అతణ్ణి వరిస్తుంది!"



www.ramkarri.com

www.Kamkarri.com



# విషయ సూచిక



www.ramkarri.com

www.Ramkarri.com





Neither money pays,nor name, nor fame, nor learning; it is Character that can cleave through adamantine walls of difficulties.

కష్టాలనే అభేద్యమైన అడ్డుగోడలను చీల్చుకొని ముందుకు సాగేది, సచ్ఛీలంతో శక్తిని సంతరించుకొన్న సంకల్ప బలమే కానీ; ధనం, పేరు ప్రతిష్ఠలు, పాండితీ ప్రకర్షలు మాత్రం కావు.

www.ramkarri.com

www.Kamkarri.com

# వ్యక్తిత్వ వికాసం

సమగ్రసుందరరంగా, అన్ని అంశాల సామరస్యంతో మానవుడు వికసించాలనేదే మన అభిమతం... హృదయం గొప్పదిగా ఉండాలి; మనస్సు గొప్పదిగా ఉండాలి, క్రియా శీలత గొప్పదిగా ఉండాలి. లోకంలోని దుస్థితికి, దుఃఖాలను చూసి వేదనపడగల హృదయం ఉన్నవారు కావాలి.

వేదన పడటమే కాకుండా, విషయాల అర్థం, ఆంతర్యం గ్రహించగలిగినవారై ఉండాలి. ప్రకృతి హృదయంలోకి చొచ్చుకుపోయి రహస్యాన్ని భేదించగలగాలి. అంతే కాదు - హృదయావేదనను, జ్ఞానాన్ని కార్యరూపంలో నిరూపించ గలగాలి. మనం కాంక్షించేది అలాంటి భావజ్ఞాన, క్రియాశీలతల సమన్వయ వికాసం.

www.ramkarri.com

www.Kamkarri.com



# వ్యక్తిత్వమే ప్రధానం

మన చుట్టూ ఏం జరుగుతున్నదో మీకు తెలుసు. ఈ ప్రపంచంలో అన్ని వస్తువులు ఎప్పుడూ పరస్పరం ప్రభావితం చెందుతుంటాయి. మన శక్తిలో కొంత భాగం మన శరీరాన్ని పోషించటానికి ఉపయోగపడుతుంది. అంతేకాదు, మన శక్తిలోని ప్రతి అణువును దివారాత్రాలు ఇతరుల మీద ప్రసరింపచేస్తూ వారిని ప్రభావితులను చేస్తున్నాం. మన శరీరాలు మనగుణాలు, మేధ ఆధ్యాత్మికత సంపత్తి ఇవన్నీ అదేవిధంగా ఇతరుల మీద తమ ప్రభావాన్ని ప్రసరింపచేస్తూనే ఉన్నాయి. అదేవిధంగా మనంకూడా ఇతరుల ప్రభావానికి లోనవుతున్నాం. మనచుట్టూ నిరంతరం జరుగుతూ ఉన్న స్థితి ఇది. ఇప్పుడు ఒక ఉదాహరణ చూద్దాం : ఒక వ్యక్తి మన ముందుకు వచ్చాడనుకుందాం. అతడు బాగా చదువుకున్నాడు, చక్కని భాష మాట్లాడతాడు. సందర్భోచితంగా మాట్లాడతాడు. కాని అతను మీకేమాత్రం నచ్చడు. మరొక వ్యక్తి వస్తాడు. ఏదో కాస్త మాట్లాడతాడు. ఆ మాటలు కూడా అంతంత మాత్రమే. ఆ మాటల్లో తప్పులు కూడా దొర్లవచ్చు. వ్యాకరణ దోషాలుండవచ్చు. ఐనా అతను మీకు బాగా నచ్చుతాడు.

ఇలాంటి అనుభవాలు మీలో చాలామందికి కలిగి ఉండవచ్చు. అంటే ఏమిటి? మనల్ని మెప్పించేవి వట్టి మాటలే

www.ramkarri.com

www.ramkarri.com



కావు. మాటలు కాని, భావాలు కాని ఒకర్ని ఆకట్టుకోవటంలో మూడింట ఒక వంతు మాత్రమే దోహదం చేస్తాయి. ఇతరులను ప్రభావితం చేయడమనేది రెండు వంతులు ఆ భావాలను, మాటలను చెప్పే వ్యక్తి వ్యక్తిత్వంపై ఆధారపడి ఉంటుంది. ఒకరి వ్యక్తిగత ఆకర్షణ మనల్ని ఆకట్టుకోవటంలో ప్రధానపాత్ర వహిస్తుంది.

మన కుటుంబాల్లో యజమానులుంటారు; వారిలో కొంతమంది ప్రయోజకులై ఉంటారు, మరి కొంతమంది ఉండరు. ఎందుకు?... మనం ఏ సందర్భంలోనైనా కృతార్థులం కాకుంటే, ఆ దోషాన్ని ఎవరి మీదో రుద్దుతాం. నేనోపనిలో విఫలమైనప్పుడు దానికి కారణం 'ఫలానివాడు' అంటాను. వైఫల్యంలో తన దోషాలను, లోపాలను అంగీకరించటానికి ఎవరూ సిద్ధపడరు. ప్రతివాడూ తాను దోషరహితుడననే నిరూపింప ప్రయత్నిస్తాడు. తప్పంతా ఎవరి మీదికో త్రోసివేస్తాడు. చివరికి "నా అదృష్టం బాగుండలేదు" అంటాడు. కుటుంబ యజమానులు, తాము సమర్థవంతంగా నిర్వహింప లేనప్పుడు, తమలో తాము ఇలా వితర్కించుకోవాలి. కొంతమంది తమ కుటుంబాలను చక్కగా తీర్చిదిద్దుకో గలిగితే మరి కొంతమంది చేయలేకపోవటానికి కారణం ఏమిటి? ...ఆ తేడా వ్యక్తిలో ఉంది; వ్యక్తిత్వ ప్రభావంలో ఉంది.

మానవాళిని నడిపించిన మహానాయకుల విషయానికి వస్తే, నాయకత్వం వహించటంలో గణనకు వచ్చేది వారి వ్యక్తిత్వ విశేషమని మనకు తెలియవస్తుంది.

www.ramkarri.com

www.Kamkarri.com



ప్రాచీన మహాకవుల్ని, చింతనాశీలురను పరికించి చూస్తే, నిజానికి వారి భావాలన్ని కలిసి ఎన్నుంటాయి? మానవజాతిని ఉద్ధరించిన మహానుభావులంతా రాసిన గ్రంధాలను పరిశీలించి చూద్దాం. ప్రపంచం పుట్టినప్పటి నుండీ ఇప్పటి వరకూ వచ్చిన అచ్చమైన భావాలను పునరుక్తి లేకుండా చూస్తే అన్నీ కలిపి గుప్పెడుకన్నా ఎక్కువ ఉండబోవు. మనకోసం వారు రాసిన పుస్తకాల్లోకి చూడండి. ఆ రచయితలు గొప్ప ప్రతిభాశాలురుగా మనకు కానరారు. తమ కాలంలో మాత్రం వారు ప్రతిభావంతులే! వారంతటి మహానుభావులు కావటానికి కారణం ఏమిటీ? వారు తలపోసిన భావాలు మాత్రం కావు; వారు రాసిన పుస్తకాలు అంతకన్నా కావు; వారు ఒనరించిన ప్రసంగాలూ కావు. వారికి చెందిన దేదీకాదు. ఆ హేతువు వారి వ్యక్తిత్వ విశేషమే. ఇంతకు మునుపే చెప్పుకున్నట్లు మూడింట రెండు వంతులు వ్యక్తిత్వం, మిగుతా ఒకవంతు మాత్రమే మేధస్సు, వాక్ చాతుర్యం. మనిషి వ్యక్తిత్వ విశేషమే ప్రధానమైనది. మనం చేసే పనులన్నీ, వ్యక్తిత్వ విశేష అభివ్యక్త స్వరూపాలే. మనిషి ఉంటేనే, చేతలుంటాయి. కారణాన్ని బట్టే కార్యం ఎప్పుడూ నడుస్తుంది.

అన్ని విద్యావిధానాలకు, శిక్షణలకు వ్యక్తిత్వాభివృద్ధే పరమావధిగా ఉండాలి. కాని వ్యక్తిత్వాన్ని అభివృద్ధి చేయటానికి బదులుగా, మనం పైపై మెరుగులు దిద్దటానికై ప్రయత్నిస్తున్నాం. పైన పటారం లోన లొటారం వల్ల

www.ramkarri.com

www.Kamkarri.com



లాభమేమిటీ? అన్ని శిక్షణల లక్ష్యం మనిషి వ్యక్తిత్వాన్ని పెంపొందించడమే. తన సహచరులను ప్రభావితం చేయగలవాడు నిజంగా ఎంతో శక్తిమంతుడు; విద్యుదుత్పాదక యంత్రం లాంటివాడు. అలాంటివాడు తన ఇచ్ఛమేరకు పరిస్థితుల్ని మార్చివేస్తాడు. అతడు మట్టినుండి బంగారాన్ని తీస్తాడు. అతడి వ్యక్తిత్వ ప్రభావం పరపిన ప్రతి కార్యం సిద్ధిస్తుంది.

www.ramkarri.com

www.Ramkarri.com



# వ్యక్తిత్వ వికాస సూత్రాలు

ఈ వ్యక్తిత్వాన్ని వికసింపచేసుకునే సూత్రాలను యోగశాస్త్రం వివరిస్తుంది. ఈ యోగసూత్రాల్ని, పద్ధతలను అనుసరిస్తే ఎవరైనా తమ వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవచ్చు. ఈ వ్యక్తిత్వం అన్నదే అనుష్ఠానపరంగా (practically) ఎంతో గొప్పది. అన్ని శిక్షణల్లో ఉన్న అంతరార్థం ఇదే. దీనికి విశ్వజనీన ఉపయుక్తత ఉంది. గృహస్థజీవితంలో, ధనిక-పేద, వ్యాపారి, తత్త్వవేత్త... వీరూ వారూ అనటం ఎందుకూ అందరి జీవితాల్లో ఈ వ్యక్తిత్వవికాసం ఎంతో ప్రాధాన్యమైన విషయం. ఈ భౌతిక సిద్ధాంతాలను మించిన, ఇంతకన్నా సూక్ష్మ సున్నిత సిద్ధాంతాలు కొన్ని ఉన్నాయి. భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక ప్రపంచాలంటూ వేరువేరుగా లేవు. ఉన్నది ఒక్కటే ప్రపంచం. ఈ ప్రపంచంలో బాగా స్థూలమైన భాగం ఈ కనిపించే భౌతిక జగత్తు. ఇది సున్నితమవుతున్న కొద్దీ, బాగా స్థూలరూపంలో కనిపించేది, ఈ శరీరం; ఎంతో సూక్ష్మమైంది జీవుడు. ఇది పిండ సృష్టిలోనిది. బ్రహ్మాండ సృష్టిలో కూడా ఇంతే. ఈ కనిపించే విశ్వమంతా బాహ్యమైన ముద్దకట్టిన దళసరితనం. ఇది క్రమంగా సూక్ష్మతమమై ఈశ్వరుడౌతుంది.

సూక్ష్మవస్తువులో అనంతశక్తి ఇమిడి ఉంటుంది. స్థూలవస్తువులో శక్తి ఉండదని మనకు తెలుసు. ఒక మనిషి

www.ramkarri.com

www.ramkarri.com



ఎంతో బరువైన పదార్థాన్ని నెత్తిన పెట్టుకువెళుతూ ఉంటాడు. అతని కండరాలు పొంగి ఉంటాయి. అతని శరీరమంతటా పరిశ్రమచేసిన లక్షణాలు కనిపిస్తాయి. మనం ఏమనుకుంటాం? అతని కండరాలు చాలా బలంగలవని అనుకుంటాం. అదికాదు, అతని శరీరంలో ఉన్న సన్నని దారాల్లాంటి నరాలే ఆ కండరాలకు బలాన్నిస్తాయి. ఆ సన్ననరాల్లో ఒక్కదాన్నైనా ఆ కండరాల్లోకి చేరకుండా కోసివేస్తే, ఈ కండరాలు ఏమీ పనిచేయలేవు. ఈ నరాలు అంతకన్నా సూక్ష్మవస్తువునుండి, అది సూక్ష్మతమ పదార్థం నుండి శక్తిని గ్రహిస్తాయి. కాబట్టి శక్తి సూక్ష్మపదార్థం నుండే జనిస్తుంది. మనం స్థూలంగా ఉండే వస్తువులోనే చలనం చూడగలం. సూక్ష్మవస్తువుల్లో చలనం చూడలేం. మొద్దుగా ఉన్న వస్తువు కదలుతూ ఉంటే, ఆ కదలికను మనం గ్రహింపగలం. కాబట్టి మనం చలనం స్థూలవస్తువుకి సంబంధించిందిగా గ్రహిస్తాం. కాని ఉన్న శక్తి అంతా సూక్ష్మదశలోనే ఉంటుంది. ఆ దశలో మనకు ఏ చలనమూ కనిపించదు. కారణం, ఆ సూక్ష్మదశలో మనం చూడలేనంత వేగంగా, తీవ్రంగా ఆ చలనముంటుంది.

ఇలా అభివ్యక్తమయ్యే సూక్ష్మతరశక్తులను గ్రహించటానికి మన కేదైనా సాధనం ఉంటే, ఈ శక్తులను మనం అదుపులో పెట్టవచ్చు. ఒక సరస్సులో అడుగునుండి బయలుదేరిన ఒక నీటిబుడగ, అది పైకి వచ్చినప్పుడు మాత్రమే మనకు కనిపిస్తుంది. కాబట్టి స్పష్టమైన రూపు సంతరించుకోని

www.ramkarri.com

www.Kamkarri.com



భావాలను మనం గుర్తించలేం. స్పష్టమైన రూపు సంతరించుకొన్న తరువాత చేతలలో మాత్రమే లేదా వ్యక్తమైనప్పుడు మాత్రమే మనం వాటిని గ్రహిస్తాం. మన చేతలు భావాలు మన అదుపులో ఉండవని మనం నిరంతరం చెబుతూనే ఉంటాం. అలాంటప్పుడు వాటిపై మనకు అధికారం ఎలా ఉంటుంది? మనం ఆ భావాలను వాటి సూక్ష్మదశలోనే అదుపు చేయగలిగితే... అంటే ఆ భావాలను మూలంలోనే, అవి భావరూపాన్ని అందుకోకపూర్వమే, అది చేష్టగా వ్యక్తం కాకముందే నిగ్రహించగలిగితే; మనం వాటిని అదుపులో పెట్టటానికి అవకాశముంటుంది. ఆ సూక్ష్మశక్తులను ఆ సూక్ష్మకారణాలను విశ్లేషించి పరీక్షించి అర్థం చేసుకోవటానికి మనకో పద్ధతి లభిస్తే, అప్పుడు మనలను మనం అదుపులో పెట్టుకోవటానికి వీలుంటుంది. తన మనసును తాను నిగ్రహించుకొనే వ్యక్తికి ఇతరుల మనసులను నిగ్రహించే శక్తి ఉంటుంది. కాబట్టే పవిత్రత నైతికతలు సదా మత లక్ష్యాలై ఉన్నాయి. శుద్ధమనస్కుడు, నీతిమంతుడైన వ్యక్తి తనను తాను నియంత్రించుకో గలుగుతాడు. పైగా అందరి మనసులు ఒక్కటే. ఒకే మహత్ తత్త్వపు భిన్నభావాలు. ఒక మట్టిముద్దను తెలుసుకుంటే, ప్రపంచంలోని మట్టినంతా తెలుసుకొన్నట్లే. తన మనసును ఎరిగి, నిగ్రహించుకోవటం చేతనైన వ్యక్తికి, ఇతరుల మనసుల రహస్యాలు తెలుస్తాయి. అతనికి మిగతావారి మనసుల మీద సాధికారకత ఏర్పడుతుంది.

www.Ramkarri.com



మన అంతరంగంలోని సూక్ష్మభాగాలను నియంత్రించగలిగితే మనకు వాటిల్లే భౌతిక అరిష్టాలు చాలవరకు అరికట్టవచ్చు. మనలోని సూక్ష్మతమ చలనాలను నిగ్రహించగలిగితే మనలను పీడించే అనేక చింతలు దూరమౌతాయి; ఈ సూక్ష్మతమ శక్తులను అదుపులో ఉంచుకోగలిగితే అనేక వైఫల్యాలను నివారించవచ్చు.

www.ramkarri.com

www.Kamkarri.com



# వ్యక్తిత్వంలో విభిన్న పొరలు

ఇంద్రియాల బాహ్యోపకరణాలు ఉండే మానవుడి ఈ స్థూలాంగానికి (ఈ దేహానికి) - సంస్కృతంలో స్థూలశరీరమని పేరు. దాని వెనుక ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం మొదలైనవి ఉన్నాయి. ఇవీ, ప్రాణశక్తులూ ఒక్కటిగా కలసిపోతాయి. ఆ మొత్తానికి సూక్ష్మశరీరమని పేరు. ఈ శక్తులు ఎంతో సూక్ష్మద్రవ్యాలతో ఏర్పడ్డవి. ఎంత సూక్ష్మాలంటే, దేహానికి ఎంతటి దెబ్బ తగిలినా, ఇవి చెక్కుచెదరనంతటి సూక్ష్మాలు. స్థూలశరీరానికి ఎంత సంక్షోభం కలిగినా ఇవి అట్లే ఉండగలవు. స్థూలశరీరం స్థూలపదార్థాలతో నిర్మితమైంది. కాబట్టి అది సదా మారుతూంటుంది. స్థూలశరీరాలు క్రొత్తవి కలుగుతుంటాయి. అంతరింద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం - ఇవి అతి సూక్ష్మ ద్రవ్యాలతో చేయబడ్డాయి. అవి యుగయుగాలకైనా మనగలిగినంత సూక్ష్మాలైనవి. దేనిచేతా అవి ప్రతిహతాలు కాజాలవు; ఎలాంటి ఆటంకాలనైనా దాటుకొనిరాగలవు. స్థూలశరీరం జడం. సూక్ష్మద్రవ్యాలతో రూపొందిన సూక్ష్మశరీరంకూడ జడమే. అదీ సూక్ష్మమైన భౌతిక పదార్థంతో ఏర్పడినదే. ఒకటి మనస్సు అని, మరొకటి బుద్ధిఅని, వేరొకటి అహంకారమని వ్యవహరింపబడుతున్నా వీటిలో ఏదీ 'జ్ఞాత' (తెలుసుకొను వ్యక్తి) కాదన్న విషయాన్ని

www.ramkarri.com

www.Ramkarri.com



సులభంగా మనం గ్రహిస్తాం. వీటిలో ఏదీ ద్రష్టకాదు, సాక్షికాదు; కర్మఫల భోక్తకాదు. ఈ మనోవ్యాపారాలన్నీ, ఈ ధీశక్తీ, ఈ అహంకారమూ మరొకరి ఉపయోగార్థం ఏర్పడివుండాలి. ఇవన్నీ సూక్ష్మభౌతిక పదార్థంతోనే నిర్మితాలయినందున అవి స్వయంప్రకాశాలవటం కుదరదు. వాటి ప్రకాశత్వం వాటికి సొంతంకాదు. ఉదాహరణకు ఈ బల్లరూపంలో వ్యక్తమౌతున్న దానికి కారణం ఏ భౌతికవస్తువూ కాజాలదు. కాబట్టి వీటన్నిటికి నేపథ్యంలో నిజమైన ప్రకాశకుడు, నిజమైన 'ద్రష్ట', నిజమైన 'భోక్త' ఒకరుండి తీరాలి. అతణ్ణి సంస్కృతంలో ఆత్మ అని, జీవాత్మ అని, మానవుడి యథార్థాత్మ అని వ్యవహరిస్తారు.

దేహం అనుక్షణం నశిస్తోంది. మనస్సు సదామార్పు చెందుతోంది. కొన్నింటి కలయికే దేహం, మనస్సు కూడా అంతే. కాబట్టి అవి సమస్త పరిణామాలకు అతీతమైన స్థితి ఎప్పటికీ పొందలేవు. క్షణికమైన ఈ స్థూలభౌతిక పదార్థావరణానికి (దేహానికి), సూక్ష్మావరణానికి (మనస్సుకి), అతీతంగా ఆత్మ అనేది ఉంది. అదే మానవుడి స్వస్వరూపం. ఆత్మ శాశ్వతమైనది, బంధరహితమైనది. మనశ్శరీరాలనే ఉపాధుల ద్వారా అభివ్యక్తమై మనకు అనుభూతమౌతోంది 'అతడి'(ఆత్మ) ముక్తస్వరూపమే. బంధరహితమైన ఆత్మసత్తే నామరూపాల వన్నెలను అతిక్రమించి వెలుగొందుతున్నది. గాఢాంధకారమైన అజ్ఞానావరణాలను చీల్చుకొని ప్రకాశిస్తూ, బాహ్యాంగా మనకు అనుభూతమౌతున్నది- అతడి

www.Ramkarri.com



అమరత్వమే, అతడి ఆనందమే, అతడి శాంతే, అతడి దివ్యత్వమే. ఆత్మే నిజమైన మానవుడు, నిర్భయుడు, అమృతుడు, స్వతంత్రుడు.

ఏ బాహ్యశక్తీ ఎలాటి ప్రభావాన్నీ ప్రసరింపచెయ్య లేని, ఏ మార్పూ కలిగించలేని స్థితే విముక్తస్థితి అవుతుంది. అన్ని ఉపాధులకూ అన్ని నియమాలకూ, కార్య-కారణ బంధాలన్నిటికీ అతీతుడైన వ్యక్తికి మాత్రమే విముక్తి (free-dom) సాధ్యం. అంటే, ఏది నిర్వికారమో అదే విముక్తంగా ఉండటం కుదురుతుంది; విముక్తం కాబట్టే అది అమృతమైంది. ముక్తం, నిర్వికారం ఐన ఈ సత్తు, ఈ ఆత్మ, మానవుడి ఈ నిజమైన ఆత్మ అన్ని ఉపాధులకు అతీతమైనది. కాబట్టి దీనికి జననం లేదు; మరణమూ లేదు.

ప్రతి మనిషిని ఒక గాజుగోళంతో పోల్చవచ్చు. భగవంతుని ప్రసరణమైన స్వచ్ఛమైన తెల్లని కాంతిని గోళం యొక్క కేంద్రంగా (ప్రతిజీవుని కేంద్రం) భావించవచ్చు. గాజుగోళపు రంగు, దళసరితనం ఒక్కొక్కదానిలో ఒక్కోవిధంగా ఉండటంచేత కిరణాలు ప్రసారమవటంలో విభిన్న లక్షణాలు పొందుతాయి. సర్వులలోను కేంద్రంగావున్న జ్యోతి ఒక్కటే. అది సర్వత్రా సమానమే; దాని సౌందర్యం ఒకే విధమైంది. ఆ జ్యోతిని వ్యక్తపరిచే ఉపకరణంలోని లోపంలోనే స్థూలదృష్టికి కానవచ్చే అసమానత్వం ఉంది. అస్తిత్వంలో మనం ఉన్నతోన్నత అంతస్తులనందుకొనేకొద్దీ ఉపకరణానికి ప్రసరణశక్తి అధికాధిక మవుతుంటుంది.

www.Kamkarri.com



# మానవుడు దైవాంశసంభూతుడు

"అమృతపుత్రులు" ఆహా! ఏం మధురవాక్కు! ఏం ఆశాజనకమైన దివ్యనామం!... సోదరులారా! అమృతపుత్రులనే పేరుతో మిమ్మల్ని పిలువనివ్వండి. నిజంగా హైందవులు ఎవ్వరినీ 'పాపులు' అని అనడానికి అంగీకరించరు. మీరు భగవంతుడి బిడ్డలు, అమృతసంతానం, శాశ్వతానంద భాగస్వాములు, పావనులు, పరిపూర్ణులు. మీరు భువిపై దేవతలు. పాపులా?... మానవుణ్ణి పాపి అనడమే మహాపాతకం; మానవస్వభావానికి అపకీర్తి, దూషణం. ఓ సింహాల్లారా! బయలుదేరండి, గొర్రెలమనే భ్రాంతిని విడనాడండి. మీరు అమృతజీవులు, ముక్తాత్మలు, శాశ్వతానందమయులు. మీరు జడప్రకృతికాదు, శరీరాలు కారు. ప్రకృతి మీ దాసురాలు, అంతేగాని పక్రృతికి మీరు దాసులు కారు.

ఈ ప్రపంచం, ఈ దేహం, మనస్సుకూడా మూఢవిశ్వాసాలే. మీరు అనంతమైన ఆత్మలు! మిణుకు మిణుకుమనే నక్షత్రాలచేత వంచింపబడటమా? సిగ్గుచేటు! మీరు అమరులు. మిణుకు మిణుకుమనే నక్షత్రాలు తమ ఉనికిని మీ వల్లనే పొందాయి.

మానవప్రకృతిలో ఏదేది ప్రబలమో, మంచిదో, శక్తిమంతమో అవన్నీ ఆ దివ్యత్వంవల్లే కలిగాయి. అనేకులలో

www.ramkarri.com

www.Kamkarri.com



అది గర్భితంగా ఉన్నా అందరూ దివ్యులే కాబట్టి, నిజానికి మానవుల మధ్య భేదంలేదు. అందరి వెనుక అనంత సాగరంవంటిది ఒకటి ఉంది. మీరూ నేనూ ఆ అనంతసాగరం నుండి వెలువడ్డ అలల వంటివారం. మనలో ప్రతి ఒక్కరం అనంతతత్త్వాన్ని ప్రకటించటానికి శక్తికొద్దీ పాటుపడుతున్నాం. కాబట్టి మనలో ప్రతి ఒక్కరిలోను అఖండ సచ్చిదానందమనే అనంతసాగరం గర్భితంగా ఉంది. అది మన జన్మహక్కు. అదే మన నిజమైన స్వభావం; లోపలవున్న దివ్యత్వాన్ని వ్యక్తపరిచే శక్తిలోని హెచ్చుతగ్గుల వల్లనే మనలో భేదం ఏర్పడుతోంది.

అనంతమైన ఆత్మశక్తి భౌతిక పదార్థం మీద పని చేయడం వల్ల భౌతికవికాసం కలుగుతుంది. ఆ శక్తి మనిషి మీదనే పనిచేస్తే, తత్ఫలితంగా అతడు దేవుడవుతాడు.

మొదట మీలోనే అంతర్గతంగా ఉన్న దివ్యత్వాన్ని అభివ్యక్తీకరించండి. ఆ తర్వాత సర్వం దాని చుట్టూ సామరస్యంతో ఏర్పడుతుంది.

www.ramkarri.com

www.ramkarri.com



# సుఖమే పరమావధి కాదు

మానవ మనుగడకు పరమావధి సుఖం కాదు, అది జ్ఞానం మాత్రమే. సుఖ సంతోషాలకు అంతం ఉన్నది. సుఖమే పరమావధి అనుకోవటం భ్రాంతి. తమ అజ్ఞానంచేత మానవుడు సుఖాన్నే అత్యున్నత ప్రాప్తి అనుకోవటమే, లోకంలో వారు అనుభవించే అన్ని కష్టాలకూ మూలకారణం. కొంతకాలం గడిచాక మానవుడు తన గమ్యం జ్ఞానమేగాని సుఖంకాదని, సుఖదుఃఖాలు రెండూ సమంగా తనకు గుణపాఠాలు నేర్పడంలో గొప్పవనీ; మేలు తన కెంత ప్రబోధకమో, కీడు కూడా అంతే ప్రబోధకమని తెలుసుకోనారంభిస్తాడు. వ్యక్తిత్వ నిర్మాణంలో సుఖదుఃఖాల పాలు రెండూ సమమని గ్రహించాలి. మంచీ-చెడూ రెండింటికీ వ్యక్తిత్వ నిర్మాణంలో సమాన బాధ్యత ఉంది. కొన్ని సందర్భాలలో మానవుడికి సుఖంకంటే దుఃఖమే ఎక్కువగా జ్ఞానాన్ని అందివ్వగలుగుతుంది. లోకశ్రేష్ఠుల వ్యక్తిత్వాన్ని పరిశీలిస్తే ... వారిలో ఎక్కువ మందికి సుఖంకంటే దుఃఖమే ఎక్కువ ప్రబోధకరమైనదని, సంపదల కంటే దారిద్ర్యమే జ్ఞానప్రదమైనదని, అభినుతల కంటే అభిఘాతాలే వారి అంతః తేజాన్ని వెలువరించినవని - ఢంకా మోగించి చెప్పగలను.

మానవ జీవిత లక్ష్యం ఇంద్రియభోగం కాదు. జ్ఞాన సాధనమే జీవిత గమ్యం. పశువు అనుభవించే ఇంద్రియసౌఖ్యం

www.Kamkarri.com



కన్నా మానవుడు ఎక్కువ మానసిక సౌఖ్యాన్ని అనుభవిస్తాడు. అతడు మానసిక సౌఖ్యం కంటేకూడా ఆత్మానందంలో ఎక్కువగా సౌఖ్యాన్ని అనుభవిస్తాడు. కాబట్టి పరమోత్కృష్టమైన జ్ఞానం ఆత్మజ్ఞానమే అనాలి. ఈ జ్ఞానంవల్లే ఆనందం లభిస్తుంది. ఈ లౌకిక విషయాలన్నీ కేవలం ఛాయామాత్రాలే. ఇవి యధార్థజ్ఞానం యొక్క, ఆనందం యొక్క క్షుద్రాతిక్షుద్ర అభివ్యక్తాలే.

మూర్ఖులే విషయసుఖాల కోసం పాకులాడతారు. ఇంద్రియబద్ధ జీవితం గడపటం సులభమైన పని. అలవాటుపడిన పాతబాటలో సాగిపోవటం, తినటం, తాగటం మరింత సులభం. సుఖప్రదమైన ఈ భావాలన్నిటిని యథాతథంగా స్వీకరించి వీటిమీద 'మతం' అనే ముద్రవేయమని ఆధునిక తత్త్వవాదులు చెబుతారు. ఇది ప్రమాదకరమైన సిద్ధాంతం. మృత్యువు ఇంద్రియాలలోనే ఉంది. ఆధ్యాత్మికంగా సాగించే జీవితమే జీవితం. దానికి విరుద్ధమైన ఏ జీవితమైనా మృత్యుసమానమే! ఈ జీవితమంతా వ్యాయామశాల అని చెప్పవచ్చు. నిజమైన జీవితం అనుభవించటానికి దీన్ని దాటిపోవాలి.

www.Kamkarri.com



# మన వక్తిత్వాన్ని మార్చుకోవడం ఎలా?

మనం చేసే ప్రతికార్యమూ, శరీరంలోని ప్రతిచలనమూ, మనం చేసే ప్రతి ఆలోచనా మనస్సులో ఆ విధమైన సంస్కారాన్ని కలిగిస్తుంది. ఈ సంస్కారాలు పైకి మనకు కనబడకపోయినా అంతర్గతంగా ఉండి అజ్ఞాతంగా పనిచెయ్యడానికి తగినంత శక్తిమంతాలై ఉంటాయి. మనస్సులోని సంస్కార సమూహం చేత మన స్థితిగతులు అనుక్షణం నిర్ణీతాలౌతున్నాయి. ఇప్పుడీ క్షణంలో నా స్థితి ఇంతకుక్రితం నా జీవితంలో ఏర్పడివున్న సంస్కారాల సాముదాయక ఫలితం. నిజంగా వ్యక్తిత్వం అంటే ఇదే. ప్రతి మానవుడి స్వభావము అతనికి ఉన్న అన్ని సంస్కారాలచే నిర్ణయించబడుతుంది. మంచి సంస్కారాలు ప్రబలంగా ఉంటే వ్యక్తిత్వం మంచిదౌతుంది. చెడు సంస్కారాలు ప్రబలంగావుంటే స్వభావం చెడ్డదౌతుంది. ఒకవ్యక్తి సదా చెడుమాటలను వింటూ, చెడు ఆలోచనలను చేస్తూ, చెడుపనులు చేస్తూవుంటే అతడి మనస్సు చెడు సంస్కారాలతో నిండి ఉంటుంది. అతడికి తెలియకుండానే అవి అతడి తలపులలో, చేతలలో తమ ప్రభావాన్ని చూపిస్తాయి. నిజానికి ఈ చెడు సంస్కారాలు సదా పని చేస్తూంటే చెడే వాటి ఫలితమౌతుంది. చెడు సంస్కారాల మొత్తం అతనిచే చెడుపనులను చేయించడానికి బలీయ ప్రేరకమవుతున్నది.

www.ramkarri.com

www.Ramkarri.com



దుష్టసంస్కారాల చేతులలో అతడొక యంత్రంగా ఉండగా, పాపం చెయ్యడానికి అవి అతడిని పురిగొల్పుతున్నాయి. ఇలాగే ఒకడు సదాలోచనలు చేస్తూ మంచి పనులు చేస్తున్నప్పుడు, వాటివలన కలిగే సంస్కారాలన్నీ మంచివటంచే, అతడు సంకల్పించకున్నా సత్కార్యాలను చేయమని అది అతణ్ణి నిర్బంధిస్తుంది. ఎన్నో సత్కార్యాలను చేసి సదాలోచనలు చేసిన వ్యక్తికి ఇక ముందుకూడ సత్కార్యాలను చెయ్యాలని అనివార్యమైన బుద్ధిపుడుతుంది; ఒకవేళ చెడుచేయాలని అతడు కోరినా అతడి సంస్కారాలన్నిటి ఫలితంగా అతడి మనస్సు అలా చెయ్యనివ్వదు. మంచిసంస్కారాలు అతడి బుద్ధిని మరలుస్తాయి. వాటికి ఆ వ్యక్తి పూర్తిగా అధీనుడై ఉంటాడు. అలాంటి వ్యక్తి సచ్ఛీలం సుప్రతిష్ఠితమై ఉన్నదని చెప్పవచ్చు.

ఒకరి వ్యక్తిత్వాన్ని నిజంగా నిర్ణయించగోరితే, అతడు ఒనరించిన మహత్కార్యాలను పరికించకూడదు. ప్రతి మూర్ఖుడూ ఏదో ఒకానొక సందర్భంలో వీరుడు కావచ్చు. మామూలు పనిలో నిమగ్నుడై ఉన్నప్పుడు మనిషిని గమనించు; ఒక గొప్ప వ్యక్తి నిజమైన వ్యక్తిత్వాన్ని అలాంటి పనులే వ్యక్తం చేస్తాయి. గొప్ప సందర్భాలు అట్టడుగు వ్యక్తిని సైతం ఏదో కొంత గొప్పదనం సంతరించుకొనేలా చేస్తాయి. కాని ఎక్కడ ఉన్నప్పటికీ సర్వదా ఎవరు గుణసంపన్నుడో అతడే నిజానికి మహోన్నతుడు.

లోకంలో మనకు గోచరించే అన్ని చేతలు, మానవ సంఘంలోని అన్ని ఉద్యమాలు, మన చుట్టూవున్న సమస్త

www.Ramkarri.com



కార్యకలాపాలు భావప్రదర్శనలు, మానవ సంకల్పరూపాలు. యంత్రాలు, సాధనాలు, నగరాలు, ఓడలు, యుద్ధనౌకలు – అన్నీ కేవలం మానవసంకల్ప రూపాలు. ఈ సంకల్పం వ్యక్తిత్వం నుంచి, అటువంటి వ్యక్తిత్వం కర్మ నుంచి ఉత్పన్నం అవుతున్నాయి. "బుద్ధిః కర్మానుసారిణీ" అన్నట్లుగా కర్మానుగుణమైన బుద్ధి కలుగుతుంది. ప్రపంచంలో జన్మించిన సంకల్పబలాన్వితులు అందరూ మహాకార్యశూరులు – లోకాన్ని తలకిందులు చెయ్యగలిగిన అఖండ శక్తిమంతులు. యుగయుగాల నుంచి చేస్తున్న నిరంతర కృషిచే వారికి అలాంటి సంకల్పబలం చేకూరింది.

మన భావనలు తీర్చిదిద్దిన మేరకే మనం రూపొందుతాం; కనుక నీ భావనల విషయంలో శ్రద్ధ వహించాలి. మాటలు అప్రధానం. భావనలు సజీవాలు, అవి సుదూరాలకు పయనిస్తాయి. మన ప్రతి భావన మన స్వీయ నడవడితో మిశ్రితమై ఉంటుంది. ఒక సాధువు ఎత్తి పొడుపులు లేక తిట్లు సైతం ఆయన ప్రేమ పావనత్వాలను పెనగొని మంచిని ఒనరుస్తాయి.

మహత్కార్యాల సాధనకు నిరంతర దీర్ఘకాల ప్రయత్నం అవసరం. అది ఫలించకపోయినా మనం కలత చెందరాదు. ఆధ్యాత్మికాగ్ని మనలో ప్రజ్వలిస్తున్నప్పుడు, అనేకమంది పతనం చెందటం, కష్టాలు వాటిల్లడం, అప్రతిహతమైన ఆటంకాలు పొడసూపటం, మానవ హృదయంలో స్వార్థం మొదలైన పిశాచాలు కఠోరంగా

www.Kamkarri.com



పెనగులాడటం సహజంగా సంభవిస్తాయి. ఈ విశ్వంలో నిశ్రేయానికి దారి కఠినంగాను, నిటారుగాను ఉంటుంది. అనేకులు సాఫల్యమవటం ఆశ్చర్యకరం, కాని అనేకమంది పడిపోవటంలో ఆశ్చర్యంలేదు. వేలకొద్దీ పతనాల వల్లనే నడవడి రూపొందుతుంది. వైరాగ్యం కలగాలంటే మనస్సు నిర్మలంగా, సాధనాయోగ్యంగా, విచారణాయుక్తంగా ఉండాలి. సాధన అసలు ఎందుకు చేయాలో ఆలోచిద్దాం. మనం చేసే ప్రతి కార్యం కూడా సరస్సు పైభాగంలో చలించే అల లాంటిది. శబ్దాది విషయాల అనుభవాలు అదృశ్యం కాగానే, వాటివల్ల ఏర్పడే సంస్కారాలు నిలచిపోతాయి. అనేక సంస్కారాలు కలసి 'అభ్యాసం' అనేది ఏర్పడుతుంది. అభ్యాసాన్ని అపరస్వభావం (second nature) అంటారు. ఈ అభ్యాసాలే మన అసలు స్వభావం, సంపూర్ణ స్వభావం కూడా. మనం సజ్జనులుగా ఉన్నా, దుర్జనులుగా ఉన్నా అంతా అభ్యాసఫలితమే. కాబట్టి ఒక అభ్యాసాన్ని అలవాటు చేసుకోవటం లేదా వదలిపెట్టటం మన చేతులలోనే ఉంది. అందుకని ప్రస్తుతమున్న మన స్వభావం గూర్చి మనం నిరాశ చెందనవసరం లేదు. సుఖ దుఃఖాది అనుభవాలు మనసులో సంస్కారాలను ఏర్పరుస్తాయి. ఈ సంస్కారాల ఫలమే మన వ్యక్తిత్వం. ఎలాంటి సంస్కారాలు మనలో బలీయమై ఉంటాయో, మన కలాంటి నడవడి ఏర్పడుతుంది. సత్సంస్కారాలు విశేషంగా ఉంటే, సద్వర్తనం అలవడుతుంది. దుష్టసంస్కారాలు ప్రబలంగా ఉంటే, దుష్టవర్తనం

www.ramkarri.com

www.Ramkarri.com



అలవడుతుంది. ఇట్లే సంతోషకర సంస్కారాలతో మనం సంతోషంగా ఉంటాం. దురభ్యాసాలను మానాలంటే, వాటికి వ్యతిరేకమైన మనోవృత్తులను అవలంబించటమే ఉపాయం. దుష్టసంస్కార జనిత దురభ్యాసాలను, మంచి అభ్యాసాలతో నిరోధించాలి. అందుకని సదా మంచినే చేస్తూ ఉండండి. ఎప్పుడూ సద్భావాలనే ఆలోచిస్తూ ఉండండి. దుష్ట సంస్కారాలను నిరోధించటానికి మార్గం ఇదే.

ఒకవ్యక్తి ఎంత దుర్జనుడైనాసరే, 'అతనిక మంచివాడు కాజాలడు' అని చెప్పవద్దు. ఎందుకంటే, అతని ప్రస్తుత వర్తనం అతని అభ్యాస ఫలితమే కదా! నూతన సదభ్యాసాలతో, తన పూర్వాభ్యాసాలను అతడు నిగ్రహింపవచ్చు. అభ్యాసఫలితమే స్వభావం. కాబట్టి మంచి అలవాట్లను అలవరుచుకోవటమే, వ్యక్తిత్వాన్ని చక్కబరచుకొనే మార్గం.

త్యజించు! సంసారాన్ని (నేను, నాది అనే భావన) త్యజించు. వంటియింట్లోకి జొరబడి ఒక మాంసపుముక్కను తింటూ, ఇంతలో ఎవరైనా వచ్చి తమను తరిమిగొడతారో అనే భయంలో అటూ ఇటూ చూస్తూండే కుక్కలమాదిరి ప్రస్తుతం మన ఉన్నాం. అలాకాక సార్వభౌముడవై ఉండు, సమస్త ప్రపంచమూ నీదే అని గ్రహించు. సంసారాన్ని త్యజిస్తేనేగాని ఈ ఎరుక నీకు అలవడదు. సంసార త్యాగానంతరమే, అది నిన్ను బద్ధుణ్ణి చేయటం మానుతుంది. శారీరకంగా త్యజించలేకుంటే మానసికంగా త్యజించు.

www.ramkarri.com

www.Kamkarri.com



హృదయాంతరాళాల నుంచి నెట్టివేయి. వైరాగ్యం కలిగి ఉండు. ఇదే నిజమైన త్యాగం, అది లేనిదే ఆత్మసిద్ధి పొందటం అసాధ్యం. దేన్నీ కోరకు; ఎందుకంటే దేన్ని కొరుతావో అదే నీకు లభిస్తుంది, దానితోబాటు తీవ్రబంధం తగులుకుంటుంది.

www.ramkarri.com

www.Kamkarri.com



# భావనా ప్రభావం

మన నుండి వెలువడే ప్రతి కర్మ (action) ప్రతిక్రియగా (re-action) మన వద్దకే వచ్చేట్లు; మన పనులు ఇతరుల మీద ప్రభావం చూపవచ్చు. వారివి మనపై ప్రభావం చూపవచ్చు. దుష్కార్యాలు చేసేకొద్దీ జనులు మరింత దుర్జనులవడం, సత్కార్యాలు చేసేకొద్దీ వారి బలం మెట్టుమెట్టుగా పెరగటం, సదా మంచిపనులనే చేయడం వారికి అలవాటు కావడం మీరంతా గుర్తించి ఉండవచ్చు. ఈ కర్మప్రభావ అతిశయాన్ని వివరించడానికి ఒకరి మీద ఒకరి ప్రభావ-ప్రతిప్రభావాలు చూపుకునే శక్తి మనకున్నది అనటంకంటే వేరే ఆధారం లేదు. భౌతికశాస్త్రం నుండి దీనికొక ఉదాహరణ. నేనొక పని చేస్తున్నప్పుడు నా మనస్సు ఫలానా స్పందనస్థితిలో ఉంటుందని చెప్పవచ్చు. ఆ విధమైన స్పందనస్థితిలో ఉన్న అన్ని మనస్సులు, నా మనోస్థితి ప్రభావానికి లోనైయ్యే ప్రవృత్తి కలిగి ఉంటాయి. ఒకేరీతిలో శ్రుతిమేళవింప బడిన వివిధ వాయిద్యాలు ఒకే గదిలో ఉన్నప్పుడు వాటిలో ఒకదానిని ధ్వనింపచేస్తే, మిగిలిన వాయిద్యాలు కూడా అదే స్వరాన్ని ఉత్పన్నం చేయడం మీరంతా గమనించి ఉంటారు. కాబట్టి ఒకే స్రుతిలో ఉన్న మనస్సులన్నీ ఒక ఆలోచన చేత సమానంగానే ప్రభావితమౌతాయి. ఒక మనస్సు ఒకే సంస్కృతిలో ఉన్న మిగతా మనస్సులను ప్రభావితం చేయగలదన్న విషయం

www.Kamkarri.com



దూరంపై, ఇతర కారణాలపై ఆధారపడి ఉంటుంది; మనస్సులు ప్రభావితమవటం మాత్రం తథ్యం. నేనొక దుష్కార్యం చేస్తున్నాననుకోండి. అప్పుడు నా మనస్సు ఫలానాస్పందన స్థితిలో ఉంటుంది. లోకంలో అలాంటి స్థితిలోనే ఉన్న ఇతరుల మనస్సు లన్నిటికి నా మనస్పందన స్థితి ప్రభావానికి లోనయ్యే అవకాశం ఉంటుంది. ఇలాగే నేనొక మంచిపనిని చేస్తున్నప్పుడు నా మనస్సు మరోస్పందన స్థితిలో ఉంటుంది; అలాంటి స్థితిలో ఉన్న ఇతరుల మనస్సులన్నీ నా మనఃప్రభావానికి లోనయ్యే అవకాశం ఉంటుంది. ఒకదానిపై ఒకటికి గల ఈ ప్రభావం ఇంచుమించు మనస్సుల ఉద్రిక్తతలలోని ఎక్కువ తక్కువలను బట్టి ఉంటుంది.

పై దృష్టాంతాన్నే మరికొంత అనుసరిద్దాం – కాంతి తరంగాలు ఏదో ఒక లక్ష్యాన్ని చేరుకోవడానకి ముందుగా కొన్ని లక్షల సంవత్సరాలు పయనించి ఉండవచ్చునుగదా. అలాగే భావతరంగాలు దేనితో కలిసిపోయి తాము స్పందిస్తాయో ఆ లక్ష్యాన్ని చేరడానికిముందు వందల సంవత్సరాలు పయనించి ఉండొచ్చు. కాబట్టి మన వాతావరణంలో మంచివైన, చెడువైన భావస్పందనాలు నిండివుండే అవకాశం ఎంతైనా ఉన్నది. ప్రతి మనస్సునుండి వెలువడే ప్రతి భావమూ తనను స్వీకరించడానికి అనువైన మనస్సును కలుసుకొనే వరకు స్పందిస్తూ పయనిస్తూనే ఉంటుంది. ఇలాంటి భావాలను గ్రైకొనడానికి కవాటాన్ని

www.ramkarri.com

www.ramkarri.com



తెరిచి ఉంచుకొన్న ఏ మానసమైనా వెంటనే వాటిని స్వీకరిస్తుంది. కాబట్టి ఒక వ్యక్తి దుష్కార్యాలు చేస్తున్నప్పుడు అతడు తన మనస్సును ఫలానా ఉద్రిక్తస్థాయికి తెచ్చుకొంటాడు. అదేవిధంగా ఒక మనిషి దుష్కార్యాలను చేస్తున్నప్పుడు తన మనస్సును ఒక శ్రుతిలోనికి తెచ్చుకుంటాడు. ఈ ఆలోచనలకు సమానమైన పూరములో ఉన్న బాహ్య ఆలోచనలు ఆ మనిషి మనస్సులోనికి చొచ్చుకువస్తాయి. దుష్కార్యాలను చేసే వ్యక్తి సాధారణంగా చెడుపనులను ఇంకా ఇంకా ఎక్కువగా చేయుడానికి కారణం ఇదే. అతడి దుష్కార్యాలు తీవ్రంగా పెరిగిపోతుంటాయి. సత్కార్యాలు చేసే వ్యక్తి విషయంకూడా ఇలాగే ఉంటుంది; వాతావరణంలోని 'మంచి' కెరటాలన్నిటిని అతడు తనలోనికి చొరనిస్తాడు, అతడి సత్కార్యాలు మరింత పెరిగిపోతాయి. కాబట్టి దుష్కార్యాలు చేసే పక్షంలో రెండు రకాల ఆపదలకు గురవుతున్నాం–

మన చుట్టూ ఉన్న దుర్భావాలన్నింటిని మనలోనికి ప్రవేశించడానికి అవకాశం ఇస్తున్నామనడం ఒకటి, కొన్ని వందల సంవత్సరాల తరువాతైనా ఇతరుల మీద ప్రభావం చూపే చెడును సృష్టించటం రెండవది.

మన దుష్కార్యాచరణం వల్ల మనకూ ఇతరులకూ బాధ కలుగుతుంది. మన సత్కార్యాచరణ వల్ల మనకూ, పరులకూ మంచి ఒనగూరుతుంది. అంతేకాక మానవుడిలోని ఇతర శక్తులన్నిటిలాగా మంచి, చెడు అనే ఈ శక్తులూ బాహ్య ప్రపంచం నుండి బలాన్ని సముపార్జించుకొంటున్నాయి.

www.ramkarri.com

www.Kamkarri.com



ఆదర్శంతో నిండి ఉండండి. మీరేమి చేసినా ఆ ఆదర్శాన్ని చక్కగా సంస్మరించండి. అట్టి స్మరణ వల్ల, మీ కార్యాలన్నీ విస్తృతి పొందుతాయి, రూపాంతరం చెందుతాయి, దివ్యభావాన్ని సంతరించుకొంటాయి. జడపదార్థం శక్తి సమన్వితమైతే, సంకల్పం సర్వశక్తి సమన్వితం. ఈ విశ్వాసం, మీ జీవితాల్లో కనిపిస్తూ ఉండనివ్వండి! మీ సర్వశక్తిని గూర్చిన, మీ ఘనతను గూర్చిన, మీ మహిమలను గూర్చిన స్మరణతో నిండి ఉండండి. మూఢవిశ్వాసాలేవీ మీ తలల్లోకి ఎక్కకుండా ఉంటే ఎంత బాగుండేది! చైతన్యాన్ని హరించే క్షుద్రత్వ దుర్బలత్వాది మూఢవిశ్వాసాలు మనల్ని జన్మమాదిగా ఆవరించకుండా ఉంటే ఎంత బాగుండేది! మహోన్నతాలు, మహిమాన్వితమైనవీ అయిన సత్యాలను తెలుసుకోవడానికి మానవులకు ఇంతకంటే సులభతర మార్గం లభించివుంటే ఎంత బాగుండేది! కాని మనిషి ఈ అవస్థలన్నింటినీ పడవలసి వచ్చింది. మీ తదనంతరం రానున్న సంతతి వాళ్లకు మార్గం ఇంకా కష్టతరం కావించకండి.

www.Ramkarri.com



# వ్యతిరిక్త (Negative) భావోద్వేగాలను నియంత్రించు

మనం నాలుగు రకాల మనోభావాలను అవలంబించడం మంచిది–

అందరితో స్నేహం కలిగి వర్తించాలి.

దుస్థితిలో ఉన్నవారి పట్ల కరుణ,

సుఖించేవారిపట్ల సంతోషం,

దుర్మార్గుల పట్ల ఉదాసీనత కలిగి ఉండాలి.

మనకు కనిపించే అన్ని విషయాల్లో కూడా ఇలాగే వర్తించాలి.

మంచి విషయాల్లో స్నేహభావం,

దుఃఖకర విషయాల్లో కరుణ,

పుణ్యకార్యాల పట్ల సంతోషం,

పాపకార్యాల్లో ఉదాసీనత వహించాలి.

ఇలా చేస్తే, మనకు మనశ్శాంతి కలుగుతుంది. ఇలా మనసును నియమించకపోవటం వల్లే, జీవితంలో మనం అనేకబాధలు పొందుతూ ఉంటాం. ఒకరు మనకు చెడు చేస్తే, వెంటనే మనం ప్రతీకారం చేయబోతాం. మనోనిగ్రహసామర్థ్యం తక్కువగా ఉందన్న విషయాన్ని ప్రతీకారం తెలియజేస్తుంది. ఒకరిని ద్వేషించటం ద్వారా, అతనికి హాని కలగచేయటం ద్వారా మనం ప్రతీకారం తీర్చుకున్నప్పుడల్లా మనసుకు ఎంతో అనర్థం వాటిల్లుతూ

www.ramkarri.com

www.Kamkarri.com



ఉంటుంది. దుష్ప్రవృత్తిని ద్వేషప్రేరిత కార్యాన్ని ప్రతీకారం చేయాలన్న సంకల్పాన్ని నిగ్రహించినప్పుడల్లా, మనకు అది ఎంతో ప్రయోజనకారి అవుతుంటుంది. మనో నిగ్రహం వల్ల అపారశక్తి జనిస్తుంది. నిగ్రహం వల్ల మనకెప్పుడూ నష్టం వాటిల్లదు. ద్వేషాన్ని లేదా క్రోధాన్ని నిగ్రహించినప్పుడల్లా, మన కెంతో మేలు చేసే సత్త్వశక్తి, వీర్యం, ప్రాణశక్తి చేకూరుతాయి. ఇలాంటి సత్త్వశక్తి నుండే ఉన్నత మానసిక శక్తులు వెలువడతాయి.

ప్రతి దుర్భావం ద్వేషపూరిత ఆలోచన అతిరహస్యంగా కొండగుహలో కూర్చుని తలచినా, అది నిక్షిప్తమై, ఎప్పుడో ఒకప్పుడు అప్రతిహత శక్తితో, ఏదో ఒక దుఃఖరూపంలో నీ వద్దకు మళ్లీ తప్పకుండా వస్తుంది. అసూయాద్వేషాలు నీ నుండి వెలువడితే చక్రవడ్డీతో సహా అవి తిరిగి నిన్నే చేరి భాదింపక మానవు. హరి హర బ్రహ్మాదులు కూడా దాన్ని అడ్డగించలేరు. ఈర్ష్యాద్వేషాలకు నువ్వు ఒక్కమారు తావిస్తే చాలు, ప్రతిఫలాన్ని నువ్వనుభవించక తప్పదు. ఈ విషయాన్ని జ్ఞాపకం పెట్టుకుంటే, నువ్వు దుష్కార్యాలు చేయలేవు.

'ఇతరులను ద్వేషించకు, ప్రేమించు' అనే నైతిక సిద్ధాంతాన్ని ఈ భావన వివరిస్తుందని నేనంటాను. ఎందుకంటే, విద్యుదుత్పాదన యంత్రం (డైనమో) నుండి విద్యుచ్ఛక్తి బయలుదేరి వృత్తాకారంలో సంచరించి తిరిగి ఉత్పన్న స్థానాన్ని చేరుకొంటుందన్న ఆధునిక విద్యుత్

www.ramkarri.com

www.ramkarri.com



సిద్ధాంతం మాదిరే ఒక వ్యక్తిలో జనించే రాగద్వేషాలు తిరిగి అతణ్ణే చేరుకొంటాయి. కనుక ఎవరినీ ద్వేషించకు; కాలాంతరంలో ఆ ద్వేషమే మిమ్మల్ని చేరు కొంటుంది. నువ్వు ఇతరులను ప్రేమిస్తే, ఆ ప్రేమ వృత్తాకారంలో సంచరించి తిరిగి నిన్ను చేరుకొంటుంది. ఒక వ్యక్తి హృదయం నుంచి బయల్వెడలిన ప్రతి ద్వేషపు తునకా మళ్లీ తిరిగి వచ్చి దారుణాస్త్రంలా అతడి పైకి రావడం తథ్యం. అదే రీతిలో ప్రేమకూడ అతణ్ణి తిరిగి చేరుతుంది.

అసూయరాహిత్యమే - దానిలో ఉన్న పరమ రహస్యం. ఇతరుల అభిప్రాయాలకు సర్వదా తల ఒగ్గటానికి సిద్ధంగా ఉండి, వారితో అన్యోన్యత సాధించటానికి ఎల్లప్పుడు పాటుపడు. రహస్యమంతా అదే... ధీరుడవై పోరాడు! జీవితమా, క్షణభంగురం. మహత్కార్యార్థం దానిని త్యాగంచేయి.

www.ramkarri.com

www.Kamkarri.com



# మొదట నిన్ను నువ్వు మలచుకో

మన మనోస్థితే మన చుట్టూ ఉన్న ప్రపంచ స్థితిని నిర్ణయిస్తుందని గ్రహించాం. మనోస్థితి మారితే, ప్రపంచ స్థితి విధిగా మారితీరుతుంది; మిమ్మల్ని మీరు పవిత్రీకరించుకోండి, ప్రపంచం తప్పక పరిశుద్ధమౌతుంది. ఈ విషయాన్ని పూర్వంకంటే ఇప్పుడు ఎక్కువగా బోధించాల్సి ఉంది. ఇరుగుపొరుగు వారి విషయాలలో మన ఆసక్తి పెరిగిపోతోంది. సొంత విషయాలలో తగ్గిపోతోంది. మనం మార్పు చెందితే ప్రపంచం మార్పు చెందుతుంది; మనం పరిశుద్ధులమైతే, లోకం పరిశుద్ధమౌతుంది. ఇతరులలోని చెడును నేనెందుకు చూడాలనేదే ప్రశ్న. నేను చెడిపోయి ఉంటేనే గాని ఇతరులలోని చెడును చూడలేను. నాలో బలహీనత లేకపోతే నాకు దుఃఖం కలుగదు. నేను పసివాడిగా ఉన్నప్పుడు నాకు దుఃఖాన్ని కలుగించినవి నన్నిప్పుడు దుః ఖపెట్టలేవు. మనస్సు మారింది కాబట్టి, ప్రపంచం కూడ తప్పక మారుతుందని వేదాంతం వక్కాణిస్తుంది.

ఇలా మనోనిగ్రహాన్ని సాధించిన వ్యక్తిపై బాహ్యమైనది ఏదీ ప్రభావం చూపలేదు. అతడికి ఇకపై బంధం ఉండదు. అతడు స్వాతంత్ర్య మనస్కుడు. అలాంటివాడే ప్రపంచంలో చక్కగా జీవింప సమర్థుడు. లోకాన్ని గురించి రెండు విధాలైన అభిప్రాయాలు గల వ్యక్తులు సాధారణంగా

www.ramkarri.com



కనిపిస్తారు. కొంతమంది నిరాశావాదులై 'ప్రపంచం ఎంత ఘోరం! ఎంత దుష్టం! అంటుంటారు. మరికొంతమంది ఆశావాదులై 'ప్రపంచం ఎంత చక్కనిది! అద్భుతమైనది! అంటుంటారు. మనోనిగ్రహాన్ని సాధించని వారికి ప్రపంచం చెడ్డదిగా తోస్తుంది లేదా మంచిచెడుల సమ్మిశ్రంగానైనా అనిపిస్తుంది. మనోనిగ్రహ సంపన్నులమైతే మనకు ఈ ప్రపంచమే ఆశాజనకమై కనబడుతుంది. అప్పుడు మనకు ప్రపంచంలో ఏదీ మంచిగాగాని చెడుగా గాని అనిపించదు; సర్వం ఉచితస్థానంలో ఉన్నట్లు పొందుపొసగివున్నట్లు అగపడుతుంది.

ప్రేమా, సౌజన్యమూ, పావనత్వమూ మనలో ఎంత పెంపొందితే బాహ్యంలోవున్న ప్రేమాసౌజన్య పావనత్వాలను మనం అంతగా చూడగలం. పరదూషణ నిజానికి ఆత్మదూషణే. పిండాండాన్ని నువ్వు చక్కబరుచుకొన్నావా (ఇది నువ్వు చేయగల పనే), బ్రహ్మాండం తనంతట తానే నీకు అనువుగా మారుతుంది. ఆదర్శ ద్రవాన్ని అది ఎంత కొద్ది పరిమాణంలో ఉన్నా దానికంటె ఎక్కువ పరిమాణంగల ద్రవంతో సరితూగేటట్లు చేయవచ్చుననే సూత్రంలా (hydrostatic paradox), ఒక నీటి బిందువు విశ్వంతో సరితూగగలదు. మనలో ఏది లేదో అది మనకు వెలుపల కూడా కనబడదు. చిన్న ఇంజనుకు పెద్ద ఇంజను ఎలాంటిదో విశ్వం మనకు అలాంటిది; చిన్నదాన్లో కనిపించే దోషం పెద్దదాన్లో ఏర్పడే చిక్కును ఊహింపచేస్తుంది.

www.ramkarri.com

www.Ramkarri.com



లోకంలో సాధించబడ్డ ప్రతియత్నమూ నిజానికి ప్రేమచేత సాధింపబడిందే. తప్పులు ఎన్నటం వల్ల ఎన్నడూ ఏ మేలూ ఒనగూరదు. వేలకొద్ది సంవత్సరాలుగా విమర్శనామార్గాన్ని అనుసరించి చూడటమైంది; నిందల వలన దేనినీ సాధించలేము.

www.ramkarri.com

www.Kamkarri.com



# పూర్తి బాధ్యతను నువ్వే వహించు

మన ప్రస్తుత స్థితికి మనమే బాధ్యులం. ఏం కాగోరతామో ఆ విధంగా అవడానికి మనకు శక్తి ఉంది. మన వర్తమానస్థితి పూర్వకర్మల ఫలితమైతే మనం పొందగోరే స్థితి ప్రస్తుత కర్మల ఫలితంగా పొందవచ్చునని నిశ్చయమౌతోంది. కాబట్టి ఎలా ప్రవర్తించాలో మనం తెలుసుకోవాలి.

మనం దేనికి అర్హులమో అదే మనకు లభిస్తుంది. స్వయంకృతం కాని దుష్ప్రాప్య మైన దుఃఖం అంటూ ఏదీ లేదు; అహంకారాన్ని వదిలి మనం ఈ విషయాన్ని గ్రహిద్దాం గాక. తగలగూడని ఎదురు దెబ్బలంటూ ఏమీ లేవు; చేజేతులా చేసుకోని కీడు ఏదీ వాటిల్లదు. ఇది మనం తప్పక తెలుసుకోవలసిన విషయం. నిన్ను పరిశీలించుకో; కష్టాలు వాటిల్లడానికి పరిస్థితులను నీవు కల్పించుకోవటం వలననే, నీకు అవి కలిగాయని కనుగొంటావు. సగం నువ్వే చేసుకొంటావు; మిగిలిన సగం బాహ్య ప్రపంచం చేసింది. కష్టాలు అలా కలిగాయి. ఈ భావన మనలను శాంతపరుస్తుంది. ఇప్పుడు ఈ పరిశీలనతో గమనించవలసిన ముఖ్య విషయం ఇది :

"బాహ్య ప్రపంచం నా ఆధీనంలో లేదు. నా అంతర్గత ప్రపంచం నా అధీనంలో ఉంది. ఏదైనా అపజయం

www.Kamkarri.com



కలిగించడానికి ఈ రెండిటి కలయిక కావలసివస్తే, నాకు కష్టాన్ని కలిగించడానికి ఈ రెండూ అవసరమైతే, నా అధీనంలో ఉన్న దాన్ని నేను నియంత్రిస్తాను. అప్పుడు కష్టం ఎలా వాటిల్లుతుంది? నిజంగా నన్ను నేను నా అధీనంలోకి తెచ్చుకుంటే, నాకెప్పుడూ కష్టం కలుగబోదు."

బాధ్యతంతా మన భుజస్కంధాలపైన ఉందన్న భావం కలిగినప్పుడు గాని, మనం పరిపూర్ణ శక్తితో, మనస్ఫూర్తిగా, కార్యాన్ని నిర్వర్తించం. మిమ్మల్ని ఒక ప్రశ్న అడుగుతాను. ఒక పసిబిడ్డను మీ చేతులలో ఉంచితే మీరెలా ప్రవర్తిస్తారు? "తాత్కాలికంగా, మీ జీవితమంతా మారిపోతుంది" అని పందెమొడ్డి చెప్పగలను. మీరెట్టివారైనా, ఆ సమయంలో స్వార్థరహితులౌతారు. భారమంతా మీపై పడగానే మీ దుర్మార్గ స్వభావాన్ని వదిలిపెడతారు. తాత్కాలికంగా మీ స్వభావమే మారిపోతుంది. కాబట్టి భారమంతా మనపై పడినప్పుడు, మన అత్యున్నత శక్తీ, మన అత్యున్నత సౌశీల్యం ప్రదర్శితం అవుతాయి. దేవులాడుతూపోయి సమీపించడానికి ఎవ్వరూ లేనప్పుడు, నిందులు మోపడానకి దయ్యం, భూతం ఏదీ లేనప్పుడు, మన భారాలు మోసే సగుణదైవం ఎవ్వరూ లేనప్పుడూ బాధ్యతంతా మన మీదనే పడినప్పుడు మనలోవున్న ఔన్నత్యమంతా బయటికివస్తుంది. నా అదృష్టానికి నేనే కర్తను. నాకు కలిగే శుభమూ అశుభమూకూడ నేను తెచ్చుకున్నదే.

www.Ramkarri.com



"జీవిత మనేది కఠిన వాస్తవం. నిర్భయులై దాన్నెదుర్కొని, అది వజ్రకఠినంగా ఉన్నా, త్రోవ చేసికొని చొరబడండి. మీ ఆత్మ అంతకన్నా బలిష్ఠం అని తెలుసుకొని, ధీరతతో ప్రవర్తించండి" అని బోధ.

మీ అదృష్ట-దురదృష్టాల విషయంలో దేవుళ్లకు ఏ విధమైన బాధ్యత లేదు. మీ అదృష్టానికి మీరే కదా కర్తలు? మీ వ్యధలకు మీరే కారకులు. మీ వ్యధలకు, మంచి చెడులను నిర్మించింది మీరే. చేతులతో కళ్ళు మూసికొని చీకటి అంటున్నారు. చేతులు తీసేయండి. వెలుగును చూడండి. మీరు స్వయంప్రకాశులు. ఇప్పటికే పరిపూర్ణులు.

మన సమస్యా పరిష్కారానికి ఇదొక్కటే మార్గం. ఇతరులను నిందించే వారి సంఖ్య దినదినానికి పెరిగిపోతోంది కదా? బుద్ధిహీనులై వారు దుఃఖంతో బాధపడుతున్నారు. తమ పొరపాట్ల వల్లే దుర్గతి పాలై, వీరు ఇతరులను నిందిస్తారే! ఇట్టి వారి దశ బాగుపడజాలదు. అందువల్ల ఎలాంటి లాభం చేకూరబోదు. తమ దోషాలను ఇతరుల నెత్తిపై రుద్ది, పరులను నిందించే ప్రయత్నం వీరిని మరింత బలహీనుల్ని చేస్తుంది సుమండీ! కాబట్టి మీ లోపాలకై ఎవరినిగాని నిందించకండి. మీ కాళ్ల మీద మీరే నిలబడి మీ బాధ్యతనంతా, మీరే వహించండి. "నేను అనుభవించే దుఃఖం నా కర్మఫలం. అందువల్ల ఇది, నా చేతనే నివారించబడగలదని ఋజువు అవుతుంది-" అనండి. నేను సృష్టించిన దాన్ని నేను నాశనం చేయగలుగుతాను. ఇతరులు సృష్టించిన దాన్ని నేను ఎన్నడు నాశనం చేయజాలను.

www.ramkarri.com

www.Kamkarri.com



కాబట్టి మనం సదా ధైర్యాన్ని బలాన్ని పూని నిలబడాలి. బాధ్యతనంతా మీ మీద పెట్టుకొని, మీ గతికి మీరే కర్తలని అంగీకరించండి. మీకు కావలసిన బలం, సహాయం మీలోనే ఉన్నది సుమండీ! కాబట్టి మీ భవితవ్యాన్ని మీరే నిర్మించుకోండి."గతాన్ని గతం పూడ్చిపెట్టుగాక!" అంతులేని భవిష్యత్తు ఉంది. మీ ప్రతి వాక్కూ, ప్రతి సంకల్పమూ, ప్రతి పనీ కూడ మీకు సంచిత ఫలాన్ని చేకూరుస్తూ ఉంటుంది. చెడు తలపులూ, చెడు పనులూ పెద్దపులులలాగా మీదకి దుముకుతాయని మరువకండి. మహోత్సాహానికీ అవకాశం ఉంది. సత్సంకల్పాలు, సత్కార్యాలు, – శతసహస్రాధిక దేవతాగణ శక్తితో మిమ్మల్ని సదా రక్షించగలవనే దృఢ విశ్వాసం కలిగి ప్రవర్తిస్తారు గాక!

www.Kamkarri.com



# పనిచేయడం ఎలా?

నిష్కామంగా కర్మను నిర్వర్తించండి. నిష్కామకర్మ పరాయణులు, పేరుప్రతిష్ఠలు ఆశింపనివారు, స్వర్గాన్ని వాంఛింపనివారు ఐన మహనీయులు ప్రతిదేశంలోను కొందరున్నారు. మేలు జరుగుతుందనే కారణంచేతనే వారు కర్మను నిర్వర్తిస్తారు. దీనికంటే ఉన్నతాశయాలతో లోకకల్యాణం పట్ల అవ్యాజప్రేమచే, లోకహితాభిలాషచే, దీనులకు హితం చేకూరుస్తూ మానవకోటికి తోడ్పడే మహాత్ములు కొందరున్నారు. సర్వసాధారణంగా పేరుప్రతిష్ఠలను ఆశించేవారికి అవి వెంటనే సిద్ధించవు. ముసలితనంలో కాటికి కాళ్లు జాపుకొని ఉన్నప్పుడు అవి లభిస్తాయి.

స్వార్థరహితంగా మానవుడు కర్మ ఒనరిస్తే, దానివలన అతడికి ఎలాంటి లాభం లేదా?

ఉన్నది, ....మహోన్నత లాభం ఉంది. స్వార్థరాహిత్యమే విశేష లాభదాయకం. కాని దానిని అలవరచుకొనే ఓర్పు జనులకు లేదు. ఆరోగ్యాన్నిబట్టి చూస్తేకూడా అది ఎంతో లాభదాయకం. ప్రేమ, సత్యం, నిస్వార్థత - అనేవి మనకు మహోన్నతాదర్శాలే గాని, కేవలం నైతిక భాషాలంకారాలు కావు. ఎందుకంటే, ఈ ఆదర్శాలలో అలాంటి శక్తి నిబిడీకృతమౌతుంది.

www.ramkarri.com

www.Kamkarri.com



వేదాంతం బోధించే పరమావధి అయిన మార్గం శాంతితో నిండి ఉంటుంది. ఆ శాంతికి వికారాలు ఉండవు. ఏం వాటిల్లినా ఆ చిత్త స్థైర్యం చలించదు. అటువంటి స్థితే కర్మ చేయడానికి ఎంతో అనుకూలమైన దశ అని జీవితానుభవంవల్ల అందరూ తెలుసుకొంటారు.

"కోరిక లేకుండా, ఫలితాన్ని ఆశించకుండా, కార్యావేశారహితులమై (Passion ) పనిచేయడం ఎలా?" అని నన్ను చాలామంది అడుగుతూ ఉంటారు. చాలాకాలం క్రిందట నేను కూడా అట్లే అనుకున్నాను. కాని పెద్దవాడనయ్యే కొద్దీ, అనుభవం చేకూరిన కొద్దీ, దాన్లో సత్యం లేదని తెలుసుకున్నాను. ఆవేశం ఎంత తక్కువైతే అంత ఉత్కృష్టమైన కర్మను చేయగలుగుతాం. ఎంత శాంతి అలవడితే అంత శ్రేయస్సు; అంత ఎక్కువ పనిని మనం చేయగలుగుతాం.

భావోద్వేగాలను అదుపులో ఉంచుకోకపోతే, మన శక్తి వృధా అవుతూ ఉంటుంది. మన ఇంద్రియాలు పటుత్వాన్ని కోల్పోతాయి. మనస్సు కలతపడుతూ ఉంటుంది. మనం సాధించగలిగే కార్యం స్వల్పం అయిపోతూంటుంది. కార్యరూపంలో ఫలవంతం కాదగ్గ శక్తి, వ్యర్థమైన మానసోద్రేకత రూపంలో వ్యయమైపోతుంది. మనస్సు శాంతితో కూడినప్పుడే, మన శక్తిఅంతా, ఉత్తమ కార్యసాధనలో వినియోగపడగలదు.

ఈ ప్రపంచంలో ప్రభవించిన ఘనతర కార్యశీలుర జీవితాలను పరికించి చూస్తే, వారంతా అద్భుత

www.Kamkarri.com



శాంతిమంతులని గ్రహించగలం. ఏమైనాకానీ, వారు చలించలేదు. కాబట్టే కోపం కలవాడు ఎంతో పని చేయలేడు. ఏం చేసినా కోపమొందనివాడు ఎంతో సాధించగలడు. కోపానికి కానీ, ద్వేషానికి గానీ, మరే భావోద్రేకానికి కానీ లోబడేవాడు పని చేయజాలడు; శక్తులు వికేంద్రీకరమవటం వలన, కొంచెంకూడ ప్రయోజనకరమైన పని చేయజాలడు. శాంతి క్షాంతులు*, శమదమాదులు** గల బుద్ధి మహత్కార్యాలను సాధించగలదు.

"కర్మ నెలా నిర్వర్తించాలో తెలుసుకోవడం వలన ఫలం ఏమిటి? లోకంలో ప్రతి వ్యక్తీ ఏదో ఒక విధమైన కర్మను నిర్వర్తిస్తూనే ఉంటాడు గదా?" అని మీరు అడగవచ్చు. కాని మన శక్తిసామర్థ్యాలు నిరర్థకంకూడా కావచ్చును. కౌశలంతోను, శాస్త్రదృష్టితోను కర్మను నిర్వర్తించడానినే కర్మయోగమని భగవద్గీత బోధిస్తోంది. నిర్వర్తించవలసిన విధానాన్ని తెలుసుకొంటే కర్మచే నిరతిశయ మహాఫలాలను పొందవచ్చు. మనస్సులో నిక్షిప్తమై ఉన్న శక్తిని అభివ్యక్తం చేసి, ఆత్మను జాగృత పరచడమే... సర్వకర్మల ఉద్దేశమని మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. ప్రతి మానవుడిలోను శక్తి ఉంది; అలాగే జ్ఞానమూ ఉంది. వివిధ కర్మలు ఈ శక్తిని, ఈ

---

* ***క్షాంతి*** : క్షమాగుణం

** ***శమదమాదులు*** : శమ, దమ, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానం (వివరణకు 'వివేకచూడామణి' పుస్తకం చూడండి.)

www.ramkarri.com

www.Ramkarri.com



జ్ఞానాన్ని జాగృతం చేయడానికి, అభివ్యక్తీకరించడానికి వినియోగించే ఉపకరణాల వంటివి.

నిష్క్రియతను అన్నివిధాల తొలగించుకోవాలి. ఎప్పుడూ కార్యపరత్వమంటే ప్రతిఘటనే. శారీరక మానసిక దౌష్ట్యాన్ని ఎదుర్కోండి; అప్పుడు ప్రశాంతత లభిస్తుంది. "ఎవ్వరినీ ద్వేషించవద్దు, చెడుకు ప్రతీకారం చెయ్యకు" అని చెప్పడం సులభమే కాని, అనుష్ఠానంలో చూసేసరికి ఆ విధమైన బోధనల తాత్పర్యం మనకు బోధపడుతుంది. లోకుల కళ్లముందు మనం అప్రతీకారాన్ని నటించవచ్చు, కాని మన అంతరంగంలో అంతసేపు ఉన్న కుళ్లు మనకు తెలుసు. నిజమైన అప్రతిఘటనతో వచ్చే శాంతి మనలో శూన్యమని మనకు అనుభవమే; ప్రతిఘటించడమే సబబని మనకు తోస్తుంది. నువ్వు ధనాన్ని వాంఛించు, ధనాపేక్షగల వ్యక్తిని లోకమంతా దుర్మార్గుడిగా పరిగణిస్తుందని గుర్తించి ఆ కారణంగా... నీలో ధనాపేక్ష ఉన్నప్పటికీ... నువ్వు ధనార్జనానికి పూనుకోనప్పటికి, నీ మనసు మాత్రం రేయింబవళ్లు ధనంవంకే పరుగెత్తుతుంది. కాపట్యం అంటే ఇదే. దీనివల్ల పిసరుకూడా ప్రయోజనం లేదు. దీనికన్నా ప్రాపంచికతలో మునగటం ఉత్తమం. కొంతకాలం అందులోని సుఖదుఃఖాల నన్నింటిని అనుభవించిన తరువాత నీకు వైరాగ్యం జనిస్తుంది. ప్రశాంతత నెలకొంటుంది.

ఇక ముందేమి జరుగుతుందోనని ఎప్పుడూ మీనమేషాలు లెక్కపెట్టేవాడు దేన్నీ సాధించలేడు. సత్యమని,

www.ramkarri.com

www.ramkarri.com



ధర్మమని నువ్వు అర్థం చేసుకున్నదాన్ని తక్షణమే ఆచరించు. భవిష్యత్తులో ఏం జరుగుతుందోనని తర్జనభర్జన చేయటం వల్ల ప్రయోజనమేముంది? ఈ జీవితకాలం అత్యల్పం. ఫలితాలను గూర్చి బేరీజు వేసుకోవడం వల్ల ఉపయోగం లేదు. ఫలప్రదాత భగవంతుడు. ఫలితాన్ని ఆయనకు వదిలివేయి. ఫలితంతో నీకేం పని? కార్యాచరణంలోనే నువ్వు నిమగ్నం కావాలి!

ఫలాసక్తి ఉన్నప్పుడే తనకు ప్రాప్తమైన కర్తవ్యం 'ఇలా వుంది', 'అలా వుంది' అంటూ మనిషి గొణుక్కుంటాడు. ఫలాపేక్ష లేని వ్యక్తికి సమస్త కర్మలూ సమానయోగ్యాలై కనబడతాయి. స్వార్థాన్ని, కామాన్ని జయించి, ఆత్మస్వాతంత్ర్యాన్ని పొందడానికి అవన్నీ వారికి పటుతర సాధనాలుగానే ఉపయోగపడతాయి. తరచు మనమంతా విశేషమైన అహంకారానికి వశులమవుతాం. మనం పూర్తిగా అంగీకరించం గాని... మనం అంగీకరించే దాని కంటే ఎక్కువగానే మన కర్తవ్యాలు, మన పాత్రతనుబట్టే నిర్ణీతాలవుతుంటాయి. స్పర్థ అసహనాన్ని పెంచుతుంది, దానిచే దయాళుత్వం నశిస్తుంది. నసపెట్టేవాడికి అన్ని కర్తవ్యాలు రుచించనివే, ఏ కర్మలూ అతడి కెన్నడూ తృప్తిని కలిగించలేవు; అతడి జీవితమంతా తప్పకుండా వ్యర్థమైపోతుంది. కాబట్టి పని చేస్తూనే ఉందాం, మన కర్తవ్యం ఏదైనాకాని చేస్తూనే ముందుకు సాగుదాం. చక్రానికి మన భుజాన్ని తగిలింప సర్వదా సంసిద్ధులమై ఉందాం. అప్పుడు మనం వెలుగును తప్పక సాక్షాత్కరించుకొంటాం.

www.ramkarri.com

www.ramkarri.com



కాబట్టి ప్రతి వస్తువులోనూ భగవంతుని ఉనికిని గుర్తించి, భగవంతుడే సర్వమూ అయి ఉన్నాడని తెలుసుకొని, ఎల్లప్పుడూ కర్మాచరణాసక్తులై ఉండండి. కాని ఈ జీవితాన్ని దివ్యమని భావించి, దైవంగానే ఎంచి, కర్మాచరణే మన కర్తవ్యమనీ, ఇది తప్ప మనకు కోరదగినదేదీ లేదనీ, ఎల్లప్పుడూ విశ్వసించండి. అన్నిటా అంతటా ఈశ్వరుడు ఉండగా, అతనికై మరో చోటికి వెళ్ళడమెందుకు? ప్రతి కర్మలోను, ప్రతి తలంపులోను, ప్రతి చిత్తప్రవృత్తిలోను, అతడిప్పటికే ఉన్నాడు కదా? ఈ విషయం తెలుసుకొని పనులు చేసుకొంటూ ఉండాలి! మార్గం ఇదొక్కటే. వేరే మార్గం లేదు. ఇలా చేస్తే కర్మఫలాలు మనల్ని బంధించలేవు. నిరర్థక వాంఛలే మన కష్టాలకు, వ్యధలకు మూలాలని మనకు ఇప్పటికే తెలుసు. కాని వాటిని దైవసంబంధమైనవిగా పరిగణించి పవిత్రంచేస్తే, ఇక అవి కష్టాలను గాని వ్యధలను గాని కల్పించవు. ఈ రహస్యం తెలిసే వరకు మానవులకు ఈ ప్రపంచం రాక్షసంగానే కనిపిస్తుంది. తమ లోపల, తమ చుట్టుపట్ల, సర్వత్రా అనంతమైన ఆనందనిధి ఉందని ఎందరికో తెలీదు. వాళ్లింతదాకా దాన్ని కనుక్కోలేదు. రాక్షస ప్రపంచమంటే ఏమిటి? “అజ్ఞానమే” అని వేదాంతమిచ్చే సమాధానం.

తన కిష్టమైన కార్యాన్ని పరమ మూర్ఖుడు సైతం సాధిస్తాడు. కాని ప్రతి కార్యాన్ని, తన అభీష్టానికి అనుగుణంగా మలచుకోగలవాడే బుద్ధిశాలి. ఏ పనీ హీనమైంది కాదు. లోకంలో ప్రతి విషయం ఒక చిన్న మఱ్ఱిగింజలా ఉంటుంది.

www.ramkarri.com

www.Ramkarri.com



ఈ ఆవగింజంత మఱ్ఱిగింజలో బ్రహ్మాండమైన మఱ్ఱిచెట్టు ఇమిడి ఉంది. ఈ తత్వాన్ని గ్రహించి, ప్రతి కార్యాన్ని మహత్కార్యంగా ఒనర్చగలవాడే నిజానికి ధీశాలి.

ఏ విధమైన విధ్యుక్త ధర్మాన్నిగాని నిర్లక్ష్యం చెయ్యకూడదు. తక్కువ స్థాయికి చెందిన పనివాడు, కేవలం ఆ కారణం చేతనే ఉన్నతస్థాయికి చెందిన పనివాని కంటే తక్కువకాడు. ఎవడెలాంటివాడో అతడు చేసే పనులను బట్టికాక అతడు పనుల చేసే తీరునుబట్టి నిర్ణయించాలి. పనిచేసే తీరు, పనిచేసే శక్తి మాత్రమే వ్యక్తిని నిజంగా పరీక్షింప గలిగినవి. అందమైన మన్నికగల చెప్పులజోడును సాధ్యమైనంత వేగంగా కుట్టగలవాడు, అతడి వృత్తిదృష్ట్యా ఉత్తముడు; జీవితకాల మంతా ప్రతిరోజూ అర్థంపర్థం లేకుండా మాట్లాడే అధ్యాపకుడు ఉత్తముడు కాడు.

ప్రతి కర్తవ్యమూ పవిత్రమైనదే. శ్రద్ధాభక్తులతో కూడిన కర్తవ్య నిర్వహణ పరమోత్కృష్టమైన ఈశ్వరారాధన. బద్ధులై, భ్రాంతిలో తగుల్కొన్నవారికి, మౌఢ్యం గాఢంగా ఆవరించి ఉన్న వారికి సంస్కారం కలిగింపటానికి 'కర్తవ్య కర్మాచరణ' విశేష సహాయకారి అనేమాట ముమ్మాటికీ నిజం.

మనకు అతి సమీపంలోవున్న కర్మను, ఇప్పుడు మన చేతిలోవున్న బాధ్యతను చక్కగా నిర్వర్తించటంచేత మనం బలిష్ఠులవౌతాం. ఇలా మన శక్తిని క్రమక్రమంగా వృద్ధిచేసుకొంటే ఏదో ఒకనాటికి సంఘంలోను, జీవితంలోను అత్యధిక గౌరవప్రదమైన, మహత్తరమైన, విధులను నిర్వహింపవలసిన స్థితిలో ఉంటామేమో.

www.ramkarri.com

www.Ramkarri.com



# ఫలాపేక్ష లేకుండా స్వతంత్రంగా పని చెయ్యి

కర్మయోగ సారమంతా ఇది :

బానిసలా కాకుండా యజమానిలా కార్యాలను నిర్వర్తించు; నిరంతరం కర్మచెయ్యి, కాని బానిసలా కాదు.

ప్రతి వ్యక్తీ ఎలా కర్మ చేస్తున్నాడో చూస్తున్నారు కదా! ఎవరికీ పూర్తి విరామం లేదు. నూటికి తొంభై తొమ్మిది మంది బానిసలలా పనులు చేస్తుంటారు. దుఃఖమే దానికి ఫలితం; అది అంతా స్వార్థపరమైన కర్మ. బంధరహితంగా, ప్రేమ సహితంగా కర్మచెయ్యి. 'ప్రేమ' శబ్దార్థాన్ని గ్రహించటం చాలకష్టం. స్వాతంత్ర్యం (బంధరాహిత్యం) ఉంటేగాని ప్రేమ ఎన్నడూ రాదు. బానిసలో నిజమైన ప్రేమ ఉండదు. నువ్వొక బానిసను సంకెళ్లచేత బంధించి నీ పనులు చెయ్యమని నియమిస్తే, గులాములా అతడు పని చేస్తాడేగాని అతడికి ప్రేమ ఉండదు. కాబట్టి మనం కూడా బానిసల మాదిరిగా లౌకిక విషయాలకోసం కర్మ ఆచరిస్తే మనలో ప్రేమ ఉండదు. మన కర్మ నిజమైన కర్మ కాబోదు. మిత్రులకోసం, బంధువులకోసం చేసే కర్మ మాత్రమే కాదు, మనకోసం మనం చేసే కర్మ సంగతి కూడ ఇలాంటిదే. స్వార్థపరమైన కర్మాచరణ దాసుని కర్మాచరణ. కర్మకు నిజమైన ప్రమాణం ఇది –

ప్రేమ సంజనితమైన ప్రతికార్యమూ ఆనందాన్ని కలిగిస్తుంది. చేసే ఏ పనైనా ప్రేమ సంజనితమైతే, దాని

www.ramkarri.com

www.Ramkarri.com



ఫలితం శాంతిప్రదం, బ్రహ్మానందప్రదం కాకుండా ఉండదు.

స్వేచ్ఛతోను, ప్రేమతోను కృషిచేసేవాడు ఫలితాలను ఖాతరుచెయ్యడు. కాని, బానిసకు చురుకు కొరడాదెబ్బలు అవసరం; సేవకుడికి వేతనం కావాలి; జీవితమంతా ఇదే తీరు. ఉదాహరణకు ప్రజా జీవనాన్ని చూడండి. సభలలో ఉపన్యసించే వక్త హర్షధ్వానాలను ఆశిస్తాడు. వీటిని తొలగించి అతడి నొక మూలన ఉంచండి. అతడిని మీరు చంపివేశారన్న మాటే. ఎందుకంటే, అతడికి అవి కావాలి. ఇది బానిసగా పనిచేయటం. అటువంటి పరిస్థితులలో ఏదో ప్రతిఫల మాశించటం స్వభావమైపోతుంది. ఇక సేవకుడి విధానం : అతడికి జీతం కావాలి. 'నేను నీకిది ఇస్తాను, నువ్వు నాకది ఇవ్వు.'

'నేను పనికోసమే (ఫలాపేక్ష లేకుండా) పనిచేస్తాను' అని అనడంకంటే సులభమైన పని మరొకటి లేదు. కాని ఇది ఆచరణలో కష్టతరమైనది.

వ్యర్థ వాంఛలకు లోబడి, అంతటా తిరిగే సామాన్య మానవులకు, "కర్మ" అంటే ఏమిటో ఎలా తెలుస్తుంది? విషయలోలుడై చిత్తవృత్తులచే ఇటూ–అటూ బలాత్కారంగా లాగబడే వాడు, కర్మ అంటే ఏమిటో ఎలా గ్రహించగలడు? నిష్కాముడై కేవలం నిస్వార్థపరుడై ఉండేవానికే కర్మాచరణ సాధ్యం. ఉద్దేశమేమీ లేని వాడే, కర్మాచరణకు యోగ్యుడు. సాధింప దగిన స్వలాభమేమీ లేనినాడు చేసేదే కర్మ.

www.ramkarri.com

www.Ramkarri.com



# ప్రపంచానికి మేలు ఒనగూర్చడం

ఇతరుల పట్ల మనకు గల విహితధర్మం – వారికి సహాయపడటం, లోకానికి హితం చేకూర్చడం.

మనం ఎందుకు లోకహితం ఒనర్చాలి?

పైకి లోకానికి తోడ్పడుతున్నట్లు కనిపిస్తుంది గాని నిజంగా అది మనకు మనం చేసుకునే సహాయమే అవుతుంది. పరోపకారం చెయ్యడానికి ఎల్లప్పుడు మనం ప్రయత్నించాలి. అదే మన ముఖ్యోద్దేశంగా ఉండాలి. కాని మనం బాగా ఆలోచించి చూస్తే లోకానికి మన సహాయంతో అవసరం లేదని గ్రహిస్తాం. నీ చేత నా చేత ఉపకారం పొందడానికి ఈ లోకం సృష్టింపబడలేదు. ఒక క్రైస్తవ ధర్మోపదేశంలో ఇలా చదివాను: "సుందరమైన ఈ ప్రపంచమంతా చాలామంచిది, ఎందుకంటే పరోపకారం చెయ్యడానికి మన కిది సమయాన్ని, సందర్భాన్ని కల్పిస్తున్నది." పైకి చూడడానికిది చక్కని ఆశయమేగాని లోకానికి మన సహాయం కావలసి ఉన్నదనటం దైవ దూషణమే కాదా? ప్రపంచం దుఃఖభూయిష్ఠ మనటం కాదనలేం; అందువల్ల పరులకు ఉపకారం చెయ్యటమే మనం చెయ్యగల ఘనకార్యం. అయినా పరులకు ఉపకారం చేయడమంటే కేవలం మనకే మనం ఉపకారం చేసుకోవటం అని కాలక్రమంలో గ్రహిస్తాం.

www.Ramkarri.com



అయినప్పటికీ మనం లోకానికి హితం చెయ్యాలి. లోకోపకారం చెయ్యడం మన భాగ్యమనే జ్ఞానం సదా ఉంటే మనలోని పరోపకార ఇచ్ఛయే మహోన్నత ప్రేరకశక్తి అవుతుంది. ఏదో పై మెట్టెక్కి కూర్చొని నాలుగు పైసలను చేతబుచ్చుకుని 'ఏమోయీ పేదవాడా, ఇదుగో' అని అనవద్దు. అతడికి దానమిచ్చి నువ్వు మేలుపొందడానికి అతడొకడు ఉన్నందుకు అతడిపట్ల కృతజ్ఞుడవై ఉండు. ధన్యత దాతకే కాని దానం పుచ్చుకొన్నవాడికి కాదు. నీ ఔదార్యాన్ని, నీ దయాగుణాన్ని లోకంలో అమలుపరచి, దాని మూలంగా నువ్వు పవిత్రుడవై, పరిపూర్ణుడవటానికి నీకు అవకాశం లభించినదని కృతజ్ఞుడవుగా ఉండు.

సాధారణంగా మనం ఈ శరీరాన్నే 'నేను' అని భావిస్తాం! కాని 'శరీరం ఇతరుల సేవకు అంకితమైంది' అని మనం తలిచామనుకోండి, అప్పుడు మనకు అహంకారాన్ని గూర్చిన స్ఫురణ ఉండదు. కొంతకాలం గడచిన తర్వాత శరీరం లేదనే (శరీరాన్ని పూర్తిగా మరచిపోయే) స్పృహ కలుగుతుంది. ఇతరులకు మేలు చేయాలనే నీ భావన ప్రగాఢమయ్యేకొద్దీ నిన్ను నువ్వు అంతగా మరిచిపోతావు. ఈ విధంగా కర్మవల్ల క్రమంగా నీకు చిత్తశుద్ధి అయ్యేకొద్దీ, నీ ఆత్మ సర్వభూతాల్లో వ్యాప్తమైందనే సత్యం నీకు అనుభవానికి వస్తుంది. కాబట్టి ఇతరులకు మేలు చేయడమనేది ఆత్మసాక్షాత్కారానికి ఒక మార్గం. భగవత్సాక్షాత్కారానికి, ఇదికూడా ఒక ఆధ్యాత్మిక సాధనామార్గమని తెలుసుకో!

www.ramkarri.com

www.Ramkarri.com



నువ్వు ఒకవ్యక్తికి ఏదైనా ఇచ్చి ప్రతిఫలం ఆశించని పక్షంలో – అతడు నీ పట్ల కృతజ్ఞుడుగా ఉండాలని భావించని పక్షంలో – అతడి కృతఘ్నత వల్ల నీకు బాధ కలుగదు. కారణం, నువ్వు దేనిని ఆశించలేదు. బదులుగా ఏదైనా పొందడానికి నీ కొక హక్కు ఉన్నట్లు నువ్వు భావించలేదు. అతడికి ప్రాప్తమైన దానిని అతడికి ఇచ్చావు; అతడి కర్మే దానిని అతడికి సంపాదించింది; నీ కర్మచేత నువ్వు దానిని అందజేసిన వాడివయ్యావు. ఏదో దానం చేశానని నువ్వు ఎందుకు అహంకరించాలి? ఇవ్వబడ్డ ధనమో, మరే ఇతర దానమో ప్రాప్తకు అందచేసిన కూలివాడవు నువ్వు. తాను చేసిన కర్మచే లోకం దానిని పొందడానికి అర్హత పొందింది. నీ అహంకారానికి ఇందులో హేతు వేముంది? లోకానికి నువ్వు ఇవ్వడంలో ఘనత ఏమీలేదు.

దేనినీ కోరవద్దు; ప్రతిఫలం ఆశించవద్దు. నువ్వు ఇవ్వవలసిన దేదో ఇచ్చివెయ్యి; అది తిరిగి నీ వద్దకు వస్తుంది – కాని ఆ తలంపు నీకిప్పుడు వద్దు. ఇది వెయ్యింతలై తిరిగి నీకు దక్కుతుంది – కాని నీ దృష్టి దానిమీద ఉండకూడదు. ఇవ్వడానికి నీకు శక్తి ఉండాలి, నువ్వు ఇవ్వాలి. దానితో అది సరి. జీవితమంతా ఇవ్వడమే అని తెలుసుకో, ప్రకృతే బలవంతగా నీ చేత త్యాగం చేయిస్తుంది. కాబట్టి బుద్ధి పూర్వకంగానే ఇచ్చివెయ్యి. శీఘ్రంగానో, ఆలస్యంగానో నువ్వు వదలుకోవలసిందే. కూడబెట్టడానికి జీవితంలో ప్రవేశించావు; భల్లూకపు పట్టుతో పిడికిలి బిగించి పట్టుకున్నావు. కాని,

www.kamkarri.com



ప్రకృతి నీ గొంతుపట్టుకుని నీ పిడికిలి తెరిపిస్తుంది. నీకు ఇష్టమయినా, కష్టమైనా నువ్వు త్యాగం చెయ్యవలసిందే. 'నేను ఇవ్వను' అని నువ్వు చెబితే వెంటనే దెబ్బ పడుతుంది; నీకు నొప్పి పుడుతుంది. చివరకు తన సర్వస్వాన్నీ త్యాగం చేయాల్సిన నిర్బంధానికి గురికాని వ్యక్తి ఎవ్వరూ లేరు. ఈ నియతిని ఎంత ప్రతిఘటించి పెనగులాడితే అంత దుః ఖపడాలి. త్యాగం చెయ్యడానికి సాహసం లేకపోవడం చేత, ప్రకృతి కోరే ఈ గొప్ప కోర్కెకు ఇష్టపడేటంత వైరాగ్యం మనకు లేకపోవటం వల్ల, మనకు దుఃఖం కలుగుతుంది. అడవులు పోయాయి. వాటి బదులు ఉష్ణం దక్కింది. సూర్యుడు సముద్రం నుండి నీటిని గ్రహిస్తున్నాడు, మనకు వర్షరూపంలో తిరిగి ఇవ్వడానికే. గ్రహించడానికి, ఇవ్వడానికి నువ్వొక యంత్రం మాత్రమే. ఇవ్వడానికే నువ్వు పుచ్చుకుంటావు కాబట్టి ప్రతిఫలం కోరవద్దు. నువ్వు అధికంగా ఇస్తూంటే నీకు అధికంగా లభిస్తుంది. ఈ గదిలోని గాలిని ఎంత త్వరగా బైటికి పంపివేస్తే, బైటిగాలి అంత త్వరగానే లోపలికి వస్తుంది. అన్ని తలుపులు, ద్వారాలు మూసివేస్తే లోపలి గాలి లోపలనే ఉంటుంది. బైటగాలి లోపలికి రానే రాదు. లోపలి గాలి కలుషితమై, విషంగా మారుతుంది. నది తన నీటినంతా సముద్రంలో కలిపి, నిరంతరం ఖాళీ అవుతోంది. నిరంతరం కొత్త నీటితో నిండిపోతోంది. సముద్రంలో కలిసి పోవడాన్ని నిరోధించవద్దు. నువ్వది చేసిన మరుక్షణంలో నిన్ను మృత్యువు కబళిస్తుంది.

www.ramkarri.com

www.Kamkarri.com



వివేకం, జ్ఞానం, ధనం, బలం, వీర్యం మొదలైన వేటివేటిని ప్రకృతి మనవద్ద ఉంచుతుందో అవన్నీ సమయం వచ్చినప్పుడు వెదజల్లబడటానికే ఉద్దేశింపబడి ఉన్నాయి. తరచు మనం ఈ సత్యాన్ని మరిచి, మన అధీనంలోని వాటిపై 'నాది' అనే ముద్రవేస్తుంటాం, దానితోనే వినాశనానికి దారిని కల్పించుకొంటుంటాం!

www.ramkarri.com

www.Kamkarri.com



# నిస్వార్థపరత విజయాన్ని చేకూరుస్తుంది

స్వార్థసాధనకై బాహ్యరూపంలో వెలువడే శక్తి అంతా వ్యర్థమౌతుంది. అలాంటి ప్రక్రియ నీ నుంచి వెలువడే శక్తిని తిరిగి నీ వైపుకు మరల్పలేదు. కాని శక్తిని వెలుపలికి పోనివ్వక నిగ్రహిస్తే అది నీకు బలవృద్ధికర మౌతుంది. క్రమంగా ఇలాంటి ఆత్మనిగ్రహం ఎనలేని సంకల్ప శక్తిని, ఏ క్రీస్తునో, బుద్ధుణ్ణో రూపొందించే సౌశీల్యాన్ని ఉద్భవింపచేస్తుంది. ఈ రహస్యాన్ని మూర్ఖులు తెలుసుకోలేరు. కాని మానవకోటినంతా పరిపాలించాలని వాంఛిస్తారు. మూర్ఖుడైనా శ్రమపడి వేచివుంటే సమస్త ప్రపంచాన్ని పరిపాలింపగలడు. అతడిని కొన్ని సంవత్సరాల వరకు వేచివుండనివ్వు; పరిపాలించాలనే మూర్ఖ అభిప్రాయాన్ని నిగ్రహించుకోనివ్వు. ఆ అభిప్రాయం పూర్తిగా తొలగిపోగానే లోకంలో అతడు అఖండ శక్తిసంపన్నుడు అవుతాడు. మనలో అనేకులం కొన్ని అడుగుల ఆవల చూడజాలకున్నాం. సంకుచితమైన చిన్న వలయమే మన లోకం. దీనిని దాటి మన చూపులను ప్రసరింపచేయటానికి కావలసిన తాలిమి మనవద్ద లేనందున మనం అవినీతిపరులం, దుర్జనులం అవుతున్నాం. ఇది మన బలహీనత, అశక్తత.

ముందుగా, తమ మేలునే చూసుకొనే స్వార్థపరత, పాపాలన్నిట్లో మహాపాపం. ఎవడైతే, తాను ముందు తినాలనీ,

www.Ramkarri.com



ఇతరులకంటే ఎక్కువ డబ్బు సంపాదించాలనీ, లోకంలోని సమస్త సంపదలను పొందాలనీ ఆశపడతాడో... ఎవడు తాను ఇతరులకంటే ముందుగా స్వర్గానికి పోవాలని, ఇతరులకంటే ముందుగా మోక్షాన్ని పొందాలనీ ఆపేక్షిస్తాడో... వాడే కరడుగట్టిన స్వార్థపరుడు.

నిష్కామి అయిన నరుడు "నేను తుదివరకు ఆగివుంటాను గాక! స్వర్గానికి పోవాలని నేను ఆరాటపడను. నా సోదరులకు ఉపకారం కలిగితే అందుకై నేను నరకానికి పోవడానికైనా సంసిద్ధుణ్ణిగా ఉంటాను" అని అంటాడు.

ఇటువంటి స్వార్థరహితవృత్తే మతానికి గీటురాయి. ఇలాంటి నిష్కామబుద్ధి ఒకనిలో ఎంత ఎక్కువగా ఉంటుందో, అతడు అంత ఆధ్యాత్మికపరుడూ, శివసాన్నిధ్యం పొందినవాడూ అవుతాడు. అతడు విద్యావంతుడైనా లేక నిరక్షరకుక్షి అయినా, ఇతరులకంటే శివునికి దగ్గరైనవాడే! అతనికి ఆ సంగతి తెలియవచ్చు లేక తెలీకపోవచ్చు. కాని స్వార్థపరుడైన నరుడు, సమస్త దేవాలయాలను దర్శిస్తూ అన్ని తీర్థాలను సేవిస్తూ, చిరుతపులిలాగా శరీరమంతా బొట్లు ధరించినప్పటికీ శివునికి సుదూరుడే.

పట్టినదంతా బంగారమవుతున్న ప్రతి వ్యక్తిలోను ఎక్కడో సంకల్ప ఐక్యత, గంభీరశ్రద్ధ, విశ్వాసం ఉండే ఉండాలి. అదే అతడి అద్భుతవిజయానికి హేతువు. అతడు సంపూర్ణంగా స్వార్థరహితుడు కాకపోవచ్చు. కాని దానికి అతడు సంసిద్ధుడవుతున్నాడు. పరిపూర్ణంగా స్వార్థరహితుడయితే

www.ramkarri.com

www.Ramkarri.com



అతడి విజయం బుద్ధుడు, శంకరుడు సాధించిన విజయాన్ని పోలివుంటుంది. స్వార్థరాహిత్యం ఎంతగా ఉంటే, విజయం అంతగా లభిస్తుంది. ఎక్కడైనాసరే, ఇదే సూత్రం.

వికాసమే జీవితం, సంకోచమే మరణం. తన స్వసుఖాలనే చూసుకొంటూ సోమరిపోతు జీవితం గడిపే స్వార్థపూరితుడైన వ్యక్తికి నరకంలో సైతం స్థానంలేదు.

www.ramkarri.com

www.ramkarri.com



# సాఫల్యాన్ని చేకూర్చేది ప్రేమే

ప్రేమ, చిత్తశుద్ధి, క్షమ - ఇవి తప్ప మరేమీ అక్కర్లేదు. జీవితమంటే వికాసం; అంటే వ్యాకోచం. అది ప్రేమగాక మరేమిటి? కాబట్టి ప్రేమంతా జీవితమే. అదే జీవితసూత్రం. స్వార్థపరత్వమంతా మృత్యువే. ఇహంలో, పరంలో కూడా ఇదే సత్యం. శుభం చేయడమే జీవితం. పరులకు మేలుచేయకపోవడమే మరణం. మీరు చూసే మానవపశువులలో నూటికి తొంభైమంది జీవన్మృతులే. వారు పిశాచాలు - ఎందుకంటే, ప్రేమకలవాడే ప్రాణం ఉన్నవాడు.

సోదరులారా! సానుభూతిని వహించండి; పేదలకోసం, పీడితులకోసం, అజ్ఞానులకోసం ఈ సానుభూతిని వహించండి. తర్వాత సర్వేశ్వరుని పాదాలకు మీ ఆత్మను సమర్పించండి. అప్పుడు మీకు శక్తి, సహాయం, అప్రతిహతమైన శక్తి లభిస్తాయి. భయపడకండి! నక్షత్ర ఖచితమైన అంతరిక్షం మీపైబడి మిమ్మల్ని అణచి వేస్తుందేమో అనే భయంతో దాన్ని చూడకండి. ఓర్పు వహించండి. కొద్దిగంటలలో, అదంతా మీ పాదాక్రాంతం కాగలదు. వేచివుండండి. ధనం, పేరు ప్రతిష్ఠలు, పాండిత్యం - ఇవి దేన్నీ ముట్టజెప్పవు; ముట్టజెప్పగలది ఒక్క ప్రేమే! దుర్భేద్యాలైన గోడలలాంటి కష్టాలను భేదించగల్గింది ఒక్క సౌశీల్యమే!

www.ramkarri.com

www.Ramkarri.com



మనుష్యులుగా పుట్టినవారికి సాటి మనుష్యుల మీద సానుభూతి లేకపోతే, అటువంటి వాళ్లను మానవులనవచ్చా?

కర్తవ్యం ఎప్పుడూ రుచించదు. ఆ చక్రం ప్రేమ స్నిగ్ధమైనప్పుడే చక్కగా నడుస్తుంది. కాకపోతే నిరంతర సంఘర్షణ ఏర్పడుతుంది. ప్రేమార్ద్రహృదయులు కాకుంటే తల్లితండ్రులు తమ బిడ్డలపట్ల, బిడ్డలు తల్లితండ్రుల పట్ల, భార్యాభర్త లొకరిపట్ల ఒకరు తమ కర్తవ్యాన్ని ఎలా నిర్వహిస్తారు? మన జీవితంలో సంఘర్షణ నిత్యం కానరావడం లేదా? ప్రేమమూలాననే ప్రేమచంద్రుడు ప్రకాశిస్తాడు. ఐనా ఇంద్రియ బానిసలమై, జీవితంలో నిత్యం తటస్థించే కామక్రోధాది వందల కొద్దీ విషయాలకు దాసానుదాసులమై ఉండటమా స్వాతంత్ర్యం? ఈ అల్ప సంఘర్షణ లన్నింటిలోను – సహనమే మహోన్నతమైన స్వాతంత్ర్య ప్రకటనం.

స్త్రీలు తమ కోప స్వభావానికి, అసహనానికి లోనై భర్తలను నిందించి తమ స్వాతంత్ర్యాన్ని నిలుపుకొంటున్నామని భావిస్తారు – కాని దానిమూలంగా కేవలం తమ దాస్యాన్ని ప్రకటించు కొంటున్నామని పాపంవారు తెలుసుకోలేరు. ఎప్పుడూ భార్యలను దూషించే భర్తల విషయం కూడా ఇలాంటిదే.

నాయనా ! ప్రేమ ఎన్నటికీ విడనాడదు; నేడో రేపో, యుగాల తర్వాతో సత్యం జయించి తీరుతుంది. ప్రేమ జయాన్ని సాధించితీరుతుంది. మీ సోదర మానవులను మీరు ప్రేమిస్తారా?... భగవద్దర్శనానికై మీరెక్కడికి పోవాలి?...

www.Ramkarri.com



దరిద్రులు, అనాథలు, దుర్బలులు, వీరు దైవాలు కారా? గంగాతీరంలో మంచినీళ్లకోసం బావిని తవ్వటమెందుకు? ప్రేమకున్న అద్భుతశక్తిలో విశ్వాసం ఉంచండి. పైకి తళతళలాడుతున్న ఈ పొగడ్తలను ఎవరు లక్ష్యపెడతారు? పత్రికలు ఏం వ్రాస్తున్నాయో నేను గుర్తుంచుకోను.

మీకు ప్రేమ ఉందా?

ఉంటే, మీరు సర్వశక్తిమంతులు.

మీరు నిజంగా నిస్వార్థపరులా?

ఐతే, మీరు అప్రతిహతులు.

సౌశీల్యమే ఎక్కడైనా పనికివచ్చేది. సముద్ర గర్భాంతరంలో ఐనా భగవంతుడు తన బిడ్డలను సంరక్షిస్తాడు.

సమష్టి జీవనంలోనే వ్యష్టిజీవనం, సమష్టి సుఖంలోనే వ్యష్టి సుఖం ఉంది. సమష్టి లేనిదే వ్యష్టి ఉనికే అసంభవం. ఇది నిత్య సత్యం – ఇదే విశ్వానికి ఆధారం. తీవ్ర సానుభూతితో సమష్టి సుఖమే తన సుఖమనీ, సమష్టి దుఃఖమే తన దుఃఖమనీ భావిస్తూ, మెల్లగా పురోగమించటమే వ్యష్టి కర్తవ్యం. కర్తవ్యం మాత్రమే కాదు, దాన్ని అతిక్రమించటం వల్లనే మరణం, పరిపాలించటం వల్లనే అమరత్వం.

నరక సదృశ్యమైన ఈ లోకంలో, ఏ ఒక్కరి జీవితంలో ఒక్కరోజైనా కొంత ఆనందాన్ని మనం సమకూర్చగలిగితే, అది మాత్రమే సత్యం. జీవితమంతా బాధపడ్డాక దీన్ని నేను నేర్చుకొన్నాను. మిగిలినదంతా ఒట్టి భ్రమ మాత్రమే.

www.ramkarri.com

www.ramkarri.com



# దౌర్బల్యమే మరణం

ఈ జన్మలోగాని, మరేజన్మలోగాని ఇక్కడ దుర్బలులకు స్థానం లేదు. దౌర్బల్యం బానిసత్వానికే దారితీస్తుంది. దౌర్బల్యం శారీరకంగాను, మానసికంగాను అన్ని రకాల దుఃఖాలకు దారి తీస్తుంది. దౌర్బల్యం మృత్యువు. మనలను అనేక లక్షల సూక్ష్మజీవులు చుట్టిముట్టి ఉన్నాయి. కాని మనం దుర్బలులం కాకుండా వాటిని చొరనివ్వడానికి శరీరం సిద్ధపడి ముందుగానే దానికి అనుకూలంగా ఉండనిదే, అవి మనకు కీడు చెయ్యలేవు. దుఃఖకారణమైన ఒక కోటి సూక్ష్మజీవులు మన చుట్టూ తిరుగుతుండవచ్చు. ఫర్వాలేదు! మనస్సు దుర్బలమయ్యే వరకూ మనలను సమీపించే సాహసం, మనలను వశపరచుకొనే శక్తి వాటికి ఉండదు. ఇదొక గొప్ప వాస్తవం :

బలమే జీవితం, దౌర్బల్యమే మృత్యువు.

బలమే ఆనందం, జీవితం శాశ్వతం, అమరం.

దౌర్బల్యం నిరంతర శ్రమ, దుఃఖం; దౌర్బల్యమే మృత్యువు.

వేటాడబడుతూన్న కుందేళ్ల మాదిరి మనమంతా భయంకరమైన దానినుండి ఎలా పారిపోతున్నామో, వాటిలానే మనం తలలు దాచుకొని సురక్షితంగా ఉన్నామని అనుకొంటున్నామో గమనించండి. భీషణమైన దానినుండి సమస్త ప్రపంచం ఏ విధంగా పారిపోతూందో చూడండి.

www.Kamkarri.com



ఒకరోజు నేను కాశీనగరం వీధిలో పోతున్నాను. వీధికి ఒక పక్క పెద్ద చెరువుంది; రెండవపక్క ఎత్తైన గోడవుంది. ఆ ప్రాంతంలో కోతులు ఎక్కువ, అవి పెద్దవి కూడా. ఒక్కో సమయంలో అవి ముక్కోపితనంతో ప్రవర్తిసాయి. నన్ను ఆ వీధిలో పోనివ్వకూడదని అవి పట్టుబట్టాయి. నేను నడుస్తూండగా అవి నావద్దకు వచ్చి అరిచి, అఘాయిత్వంచేసి, నా కాళ్లను గట్టిగా పట్టుకున్నాయి. నేను వాటి పట్టును విడిపించుకొని పరుగెత్తసాగాను. నేను వేగంగా పరిగెత్తే కొద్దీ అవీ మరింత వేగంగా నా వెంటబడ్డాయి. నన్ను కరవసాగాయి. వాటినుండి తప్పించుకొని పోవటం నాకు అసాధ్యం అనిపించింది. సరిగ్గా ఆ సమయంలో ఒక అపరిచితవ్యక్తి కనబడి, "మృగాలను ఎదుర్కోండి" అని హెచ్చరిక చేశాడు. నేనప్పుడు వాటివైపు తిరిగాను; వాటిని ఎదిరించాను. అవి వెనక్కు తిరిగి పారిపోయాయి.

ఇది జీవితాంతం ఉపకరించే గుణపాఠం–

భీషణమైన దాన్ని ఎదుర్కోండి ;
ధైర్యంతో ప్రతిఘటించండి.

ఆ కోతుల మాదిరి జీవితంలోని కష్టాలన్నీ తొలగిపోతాయి. మనం ఏనాటికైనా స్వతంత్రులం కావాలనుకుంటే, ఆ స్వాతంత్ర్యం ఎన్నడూ పలాయనం వల్ల కాకుండా ప్రకృతిపై విజయం సాధించటంతోనే సాధ్యమౌతుంది. పిరికిపందలు విజయాలను పొందలేరు. కష్టాలు, అజ్ఞానం తొలగిపోవాలంటే మనం ధీరులమై వాటితో పోరాడవలసిందే.

www.ramkarri.com

www.Ramkarri.com



మన జీవితానికి కావలసింది బలమే. పాపం, దుఃఖం అని మనం అనుకొనే వాటికి ఉన్న కారణం ఒక్కటే – అదే దౌర్బల్యం. దౌర్బల్యంతో అజ్ఞానం, అజ్ఞానంతో దుఃఖం వాటిల్లుతాయి. జ్ఞానం మనలను శక్తి సంభరితులను చేస్తుంది. అప్పుడు కష్టాలను చూసి నవ్వుతాం; దుర్మార్గుల దౌర్జన్యాన్ని చూసి మందహాసంచేస్తాం; క్రూరమైన పులి తన స్వభావం వెనుకవున్న నా ఆత్మనే వ్యక్తం చేస్తూంది.

బలిష్ఠులుకండి, నా యువమిత్రులారా! భగవద్గీతా పారాయణంకన్నా "ఫుట్‌బాల్" ఆటే మిమ్మల్ని త్వరగా మోక్షమార్గానికి తీసికొని వెళుతుంది. ఇవి మహాసాహస వచనాలు! అయినా నేను వాటిని చెప్పవలసిందే; నాకు మీ రంటే ఎంతో అభిమానం. ఎక్కడ తట్టి లేపాలో నాకు తెలుసు. నేను కొంచెం అనుభవాన్ని సంపాదించాను. మీ జబ్బలు, మీ కండరాలు, ఇంకా కొంచెం బలపడినప్పుడు మీరింకా బాగా గీతను అర్థం చేసికోగలుగుతారు. మీలో ఇంకా కొంచెం బలముంటే, మీలో ఉడుకు రక్తం ప్రవహిస్తుంటే శ్రీకృష్ణుని మహాబలాన్ని, ప్రతిభావిశేషాన్ని చక్కగా అర్థం చేసికోగలుగుతారు. మీ మనశ్శరీరాలు దృఢంగా ఉన్నప్పుడు, మిమ్మల్ని మీరు ధీశాలులుగా భావించుకొన్నప్పుడు ఉపనిషత్తులను, ఆత్మమహిమను సమగ్రంగా గ్రహించగలరు.

"ప్రపంచంలో దుర్జనులున్నారు, పాపులున్నారు" అని అనకండి. "మా దృష్టికి, ఇంకా దుర్జనులు, పాపులు కనిపిస్తున్నారే" అని దుఃఖించండి, విలపించండి. లోకానికి

www.Kamkarri.com



ఉపకారం చేయగోరితే లోకాన్ని తూలనాడి, దాన్ని ఇంకా బలహీనం చేయకండి. పాపం, దుఃఖం మొదలైనవన్నీ బలహీనతకు ఫలాలే సుమండీ! ఇట్టి బోధలచే లోకంలో ఉన్న బలహీనత క్రమక్రమంగా ఎక్కువవుతోంది. చిన్నప్పటినుండీ "మీరు దుర్బలులు, మీరు పాపాత్ములు" – అని లోకులకు చెబుతున్నారు. "మీరందరు... మీలోని అధమాధములు సైతం అమృతపుత్రులు, మహిమాఢ్యులు" అని బోధించండి. చిన్ననాటినుండీ బలప్రదాలు, ధైర్యప్రదాలు, ఆశాజనకాలు అయిన ఆశయాలతో వారి మనస్సులను ఉత్తేజపరచండి. మీరూ అట్టి భావాలనే పొందండి. అధీరతను, నిరాశను పెంపొందించే ఆశయాలను చేరనీయకండి. "సోఽ హమ్, సోఽ హమ్" (నేను అతడిని) అనే భావం, మీ మనస్సుల్లోకి ఎక్కించుకోండి. రేయింబవళ్లు, మీ మనస్సులు ఆ భావంతో ధ్వనించుచుండును గాక! మరణకాలంలో కూడా "సోఽ హమ్" అని ప్రకటించండి. అదే సత్యం. అనంతమైన విశ్వశక్తి అంతా మీదే. మీ మనస్సుల్ని ఆవరించి ఉన్న వెర్రినమ్మకాలను పారద్రోలండి. సత్యాన్ని తెలుసుకోండి. సత్యాన్ని అభ్యసించండి. గమ్యం దూరమే కావచ్చును. కాని...

లేవండి! మేల్కొండి! గమ్యం చేరే వరకూ ఆగకండి!

సర్వస్వం కోల్పోయి నిరుపేదలైనవారు ధనం సంపాదించడానికి అన్ని రకాలైన, చిత్రవిచిత్రాలైన పద్ధతులను అవలంబిస్తారు. జ్యోతిష్యం మొదలైన వాటిని ఆశ్రయిస్తారు. "ఉద్యోగినం పురుష సింహముపైతి లక్ష్మీః దైవేన దేయమితి కా పురుషాః వదంతి" అని సంస్కృతంలో ఒక సూక్తి వుంది.

www.Ramkarri.com



"నేను నా కర్మకు కారకుణ్ణి" అని ధైర్యంగా నిలబడి చెప్పేవాడు బలవంతుడు. వృద్ధాప్యంలో అడుగుపెడుతున్న వారే అదృష్టాన్ని గూర్చి మాట్లాడతారు. యువకులు సాధారణంగా జ్యోతిష్యం జోలికి వెళ్లరు. మనం గ్రహాల ప్రభావం క్రింద ఉండవచ్చును. కాని దాన్ని మనమంతగా లెక్కపెట్టకూడదు.

నక్షత్రాలు రావచ్చు. దాని వలన ఏం హాని? ఒక నక్షత్రం నా జీవితాన్ని కలతపరచ గలిగితే అది ఒక అణాకు కూడా లెక్కకాదు. జ్యోతిషం వంటి రహస్య విషయాలు సాధారణంగా దుర్బల మనస్సుకు చిహ్నమని మీరు తెలుసుకోండి. కాబట్టి మన మనస్సులలో అది అధికమైతే ఒక వైద్యుణ్ణి సంప్రదించి, పథ్యంచేసి విశ్రాంతి తీసుకోండి.

నేను ప్రబోధించే వాటిలో ఒక్కదాన్ని వక్కాణించి చెబుతాను. ఆధ్యాత్మిక, మానసిక, శారీరక దౌర్బల్యం కలిగించే దేనిని కూడా నీ కాలి బొటనవ్రేలితోనైనా తాకవద్దు. మానవుడిలో సహజంగానే అంతర్గతమైన ఉన్న శక్తిని అభివ్యక్తీకరించడమే మతం. అనంతశక్తి ఉన్న ఒక స్ప్రింగ్ ఈ చిన్న శరీరంలో ఉంది. ఆ శక్తి ప్రకటితమయ్యే కొద్దీ ఈ దేహాలన్నీ చాలకున్నాయి. కనుక అది వాటిని పారేసి ఉన్నత దేహాలను ధరిస్తోంది. ఇదే మానవుడి చరిత్ర; మతం, నాగరకత అభ్యుదయాల చరిత్ర. స్వశక్తిని పూర్తిగా అభివ్యక్తంచేసే ప్రయత్నమే ఈ చరిత్ర. జ్యోతిషం లాంటి భావనలలో పిసరంత సత్యం ఉండటం నిజమైనా వాటిని వదిలివెయ్యాలి. బద్ధుడైన శక్తిమంతుడు ప్రామీథియస్ బంధముక్తుడౌతున్నాడు.

www.ramkarri.com

www.Kamkarri.com



# ధైర్యం వహించండి

దక్షిణ సముద్ర ద్వీపాల దగ్గర, తుఫానులో చిక్కుకున్న కొన్ని ఓడలను గూర్చి, ఒకకథను ఒకసారి చదివాను! 'ఇలస్ట్రేటెడ్ లండన్ న్యూస్' పత్రికలో, దాన్ని సూచించే బొమ్మ ఒకటి ఉంది. ఆ ఓడలన్నీ నాశనమయ్యాయి ఒక్క ఆంగ్లేయ నౌక మాత్రం, గండం తప్పించుకొని సాగిపోయింది. అందులోని వాళ్లను చూచి, మునిగిపోతున్న ఓడలపై నిలిచినవాళ్లు ప్రోత్సాహక నినాదాలు చేస్తున్నట్లు బొమ్మలో చూపబడింది. వాళ్లలాగా మీరూ ధైర్యవంతులై, ఉదారబుద్ధులై వర్తించండి.

అంధకారం ఆవరించినప్పుడల్లా సత్యాన్ని ఉద్ఘాటించు. అందుకు ప్రతికూలమైనదల్లా అంతరించి పోవలసిందే. ఎందుకంటే ఇదంతా స్వప్నమే. కష్టాలు కొండలంతగా కనిపించినా, పరిస్థితులన్నీ భయంకరాలుగా, నిరాశాజనకాలుగా ఉన్నా అవన్నీ మాయే. దానికి భయపడొద్దు, అది తొలగిపోతుంది. దాన్ని అణచిపెట్టు, అది అదృశ్యమౌతుంది. దాన్ని తొక్కివెయ్యి, అది చస్తుంది. భయపడకు! 'ఎన్నిసార్లు పరాజయం పొందాను' అని అనుకోవద్దు, లెక్కచెయ్యకు. కాలం అనంతం, ముందుకు సాగిపో. ఆత్మ శక్తిని మాటిమాటికి నిలదొక్కుకో. వెలుగు

www.ramkarri.com

www.Kamkarri.com



వచ్చేతీరుతుంది. పుట్టిన ప్రతి ప్రాణిని నువ్వు ప్రార్థించవచ్చును. కాని నీకెవరు వచ్చి సహాయపడతారు? మృత్యువు మాటేమిటి? దాన్నుండి తప్పించుకొన్న వారెవ్వరు? నిన్ను నువ్వే తరింపచేసుకో.

సఖా! వేరెవరూ నీకు తోడ్పడలేరోయ్!
ఎందుకంటే నీకు నువ్వే ప్రబలతమ శత్రువ్వు,
నీకు నువ్వే ప్రగాఢ మిత్రుడవు.
కనుక ఆత్మభావాన్ని అవలంబించు. లే! భయపడవద్దు.

ధైర్యశాలివై ముందుకు పో! ఒక్క రోజులోను, ఒక్క సంవత్సరంలోను నీకు జయం కలుగుతుందని ఆశించకు. ఎల్లప్పుడూ ఉత్తమోత్తమమైన ఆదర్శాన్ని వహించివుండు. స్థైర్యాన్ని పూను. ఈర్ష్య, స్వార్థాలను విడనాడు. సత్యానికి, మానవ సంఘానికి, నీ దేశానికి విశ్వాసపాత్రుడవై మెలిగితే, ప్రపంచాన్నే కదలించివేస్తావు. మనిషికి మంచి నడతతో కూడుకొన్న జీవితమే శక్తిని ప్రసాదిస్తుంది. మరేదీ కాదు. బానిసలందరికీ ఈర్ష్యే వినాశ హేతువు. మన జాతి వినాశనానికి కూడ అదే కారణం. దాన్ని ఎప్పుడూ వదలివెయ్యి. సకల శుభాలు, సర్వశ్రేయాలు కలుగుగాక!

www.Kamkarri.com



# విరత్వం

మిత్రమా, ముందు 'మనిషి' వవు; అప్పుడు ఇవీ, తదితరాలూ తమంతట తామే నిన్ను వెతుక్కుని వస్తాయి. హేయమైన ఆ అసూయను, శునకాల మాదిరి పరస్పరం కాట్లాడుకొంటూ, మొరుగుతూ ఉండటాన్ని విడిచిపెట్టండి. సదుద్దేశాలను, సత్సాధనాలను, నైతిక పౌరుషాన్ని చేపట్టి ధీరుడవై ఉండు. మానవజన్మ ఎత్తినందుకు, శాశ్వతమైన జ్ఞాపకాన్ని ఒకటి ఈ ప్రపంచంలో వదలివెళ్ళు. "ఓ తులసీ,* నువ్వు ఈ ప్రపంచంలో ప్రవేశించినప్పుడు లోకం సంతోషించింది, నువ్వు ఏడ్చావు. నువ్వు ఈ లోకాన్ని వదలిపోయేటప్పుడు నీకోసం లోకం ఏడ్చేటట్లుగా, నువ్వు ఆనందంతో నవ్వుతున్నట్లుగా, ఏర్పడే రీతుల్లో కార్యాలొనరుస్తూ జీవితాన్ని గడుపు." ఇలా చెయ్యగలిగితే, నీ మానవనామం సార్థకమౌతుంది. చెయ్యకపోతే, నువ్వు పుట్టి ఏంచేసినట్లు?

లోకం దాని ఇష్టం వచ్చినట్లు మాట్లాడనీ, నేను ధర్మమార్గాన్నే అనుసరిస్తాను. ఇది ధీరుని విధానం అని తెలుసుకో! లేకపోతే, రాత్రింబవళ్లు వీడేమి అన్నాడో, వాడేమి వ్రాశాడో అని చూస్తుంటే, ఈ లోకంలో ఏ మహత్కార్యం సాధ్యం కాదు.

---

* **తులసీ :** ఇవి తులసీదాస్ తనను తాను ఉద్దేశించి పలికిన వచనాలు. ఈయన గొప్ప భక్తుడు, శ్రీరామచరిత మానస్' గ్రంథకర్త.

www.ramkarri.com

www.ramkarri.com



ప్రజలు నిన్ను పొగడనీ, లేక తెగడనీ, నీ శరీరం ఈ రోజే పతనం కానీ, లేక ఒక యుగం తర్వాత రాలిపోనీ సత్యమార్గం నుండి నువ్వు తప్పిపోకుండా చూచుకో. శాంతిధామాన్ని చేరేలోపల ఎన్ని తుఫానులను, ఎన్ని కల్లోలాలను తట్టుకోవాలో! మనిషి ఎంత గొప్పవాడైతే అంత కష్టమైన పరీక్షలకు గురి అవుతాడని మనం గ్రహించాలి. నిత్యజీవితం అనే ఒరిపిడిరాయి మీద వారి జీవితాలు సత్యమని నిరూపింపబడినప్పుడే లోకం వారిని మహాపురుషులని గుర్తిస్తుంది. బలహీనమైన గుండె కలవారు, పిరికిపందలు సముద్రంలోని మహాకల్లోలాన్ని చూచి భయపడి సముద్రతీరంలోనే తమ దోనెల్లో మునిగిపోతారు. ధీరుడైనవాడు వీటిపై తన దృష్టిని సారించడు. "ఏది సంభవించినా సంభవించనీ, మొదట నా ఆదర్శాన్ని నేను సాధించాలి"– ఇదే పురుషకారం. అటువంటి పురుషప్రయత్నం లేకుండా, నీలో ఉన్న జడత్వాన్ని, సోమరితనాన్ని పారద్రోలటానికి, ఎంతటి భగవత్సహాయం లభించినా చాలదు.

నిరుత్సాహంతో అధైర్యపడేవారు జీవితంలో ఏ పనినీ సాధించలేరు. ఏడుస్తూ, మొత్తుకుంటూ జన్మలెత్తుతూ ఉంటారు, పోతుంటారు. వీరులైన వారిదే ఈ లోకం (వీర భోగ్యా వసుంధరా); ఎవడో ఒక ధీరుడైనవాడే ఆత్మను దర్శిస్తున్నాడు (కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్) అని కఠోపనిషత్తు(4-1) వచిస్తోంది. ఇది అచంచలమైన సత్యం. ధీరుడవు కా! ఎప్పుడూ ఇలా అనుకో.

www.ramkarri.com

www.Kamkarri.com



"నేను నిర్భయుణ్ణి!" భయపడవద్దని ప్రతివారితోను చెబుతూ ఉండు.

భయమే మృత్యువు, మృత్యువే భయం.

భయమే పాపం! భయమే నరకం! భయమే అధర్మం!

ఈ లోకంలో కనబడే వ్యతిరేక భావాలు-తలపులు ఈ భయమనే పిశాచం నుండి వచ్చినవే. ఈ భయమే సూర్యుణ్ణి, గాలిని, మృత్యువును వాటివాటి స్థానాల్లో ఉంచి పని చేయిస్తున్నది. దానివల్లనే వారు ఈ బంధాన్నుండి తప్పించుకోలేరు.

ఈ సంసారంలో, అంటే ప్రపంచంలో ఉండేటంత వరకు నువ్వు మాటిమాటికీ సుఖదుఃఖాలు, సంపద, దుస్థితి అనే అలల మీద కొట్టుకుపోతుంటావు. కాని అవన్నీ క్షణభంగురాలని తెలుసుకో! వాటిని పట్టించుకోకు.

www.ramkarri.com

www.Kamkarri.com



# ఆత్మవిశ్వాసం

మనపై మనకు విశ్వాసాన్ని కలిగి ఉండడం అనే ఆదర్శం మనకు అత్యంత ప్రయోజనకరం. మనం అధికంగా ఆత్మవిశ్వాసాన్ని నేర్చి, దాన్ని అనుష్ఠించి ఉంటే, మనం ఇప్పుడు అనుభవించే అనర్థాలు, దుఃఖాలు చాలా వరకు రూపుమాసి ఉండేవి. మానవ చరిత్రనంతటినీ పరికిస్తే, ఘనకార్యాలను చేసిన స్త్రీ-పురుషుల జీవితాల్లో అన్నింటికంటే ఎక్కువగా సామర్థ్యాన్ని ఇచ్చిన మూలశక్తి, వారి ఆత్మవిశ్వాసమే అని తెలియవస్తుంది. వాళ్లు ఘనులమనే విశ్వాసంతో జన్మించారు. ఘనులే అయ్యారు. ఒక వ్యక్తి, అధమాధమ స్థితిలో పడిపోయాడనుకోండి. కొంతకాలనికి అతడే, నిరాశ తీవ్రత వల్లనే, తన స్థితినుండి ఊర్ధ్వ గమనాన్ని సాగించి, ఆత్మవిశ్వాసాన్ని సంతరించుకొని తీరతాడు. అయినా మొట్టమొదటే, మనం దాన్ని గుర్తించడం శ్రేయం.

తనను తాను ద్వేషించుకో నారంభించిన వ్యక్తికి పతనద్వారం తెరువబడినట్లే; దేశం విషయంలో కూడా ఇదే వర్తిస్తుంది.

మనల్ని మనం ద్వేషించుకోకుండా ఉండటమే మన ప్రథమ ధర్మం. ఎందుకంటే, పురోభివృద్ధి పొందడానికి మొదట మనపైన, తరువాత భగవంతునిపైన విశ్వాసాన్ని కలిగి ఉండాలి. ఆత్మవిశ్వాసం లేని వ్యక్తికి భగవంతునిపై విశ్వాసం కలగటం కలలోని మాట.

www.ramkarri.com

www.Kamkarri.com



నువ్వేది కాగోరితే అదే కాగలవు. నువ్వు దీనుడవు అనుకుంటే దీనుడివే; బలాఢ్యుడను అనుకొంటే బలాఢ్యుడివే కాగలవు. పాపిని అనుకొంటే పాపివవుతావు; పుణ్యశాలి ననుకొన్నావా, పుణ్యశాలి వవుతావు. మనం దీనులమని అనుకోవడం తగదని ఇది మనకు నేర్పుతోంది. బలాఢ్యులం, సర్వశక్తిమంతులం, సర్వజ్ఞులం అని మనం సంకల్పం చేయాలి! ఆ శక్తి అంతా ఇప్పుడు నాలో అభివ్యక్తం కాకపోవచ్చు, కానీ అది నాలోనే ఉంది.

సమస్త జ్ఞానం నాలో ఉంది;
సర్వ శక్తి నాలో ఉంది;
నేను పరమ పవిత్రుణ్ణి, నిత్యముక్తుణ్ణి.

ఈ జ్ఞానాన్ని నేను ఎందుకు అభివ్యక్తం చేయలేక పోతున్నాను?... నాకు దానిపై విశ్వాసం కుదరలేదు కాబట్టే! దానిపై నాకు విశ్వాసం కలిగిన వెంటనే, అది అభివ్యక్తం కాగలదు. అభివ్యక్తమైయ్యే తీరుతుంది.

ఆత్మవిశ్వాసం కలిగిన కొద్దిమంది చరిత్రే ప్రపంచ చరిత్ర. ఆ విశ్వాసం నీలోని దైవశక్తిని ప్రేరేపిస్తుంది. దానితో నువ్వు ఏమైనా చెయ్యవచ్చు. ఆ అనంతమైన శక్తిని ప్రకటించడానికి తగినంతగా నువ్వు ప్రయత్నించకపోతే నువ్వు తప్పుచేసిన వాడవవుతావు. మనిషిగాని జాతిగాని ఆత్మవిశ్వాసం కోల్పోగానే మరణోన్ముఖు లవుతారు.

www.ramkarri.com

www.Ramkarri.com



# అనుకరణ మంచిది కాదు

మిత్రమా, నువ్వు పిదప గ్రహించాల్సిన విషయం: మనం ఇతర జాతులనుండి నేర్చుకోవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి. తాను నేర్చుకోవలసిన విషయం ఇంకేదీ లేదని చెప్పేవాడు అవసానదశకు వచ్చాడనడం స్పష్టం. తనకు సమస్తం తెలుసునని పలికే జాతి కూడా వినాశదశకు వచ్చేస్తుంది. ‘‘నాలో ఊపిరి ఉన్నంతదాకా నేను నేర్చుకొంటూనే ఉంటాను.” కాని మనం ఈ సందర్భంలో గమనించాల్సిన విషయం ఒకటుంది – ఇతరులనుండి మనం గ్రహించే అన్నింటిని మన మార్గానికి అనువుగా మలచుకోవాలి. ఇతరులు నేర్పినదంతా మనకున్న దాన్లో చేర్చుకొంటాం గాని స్వకీయమైనదాన్నంతా చెక్కుచెదరకుండా కాపాడుకోవడంలో జాగ్రత్త వహించాలి.

ఒకడు మరొకడికి బోధించలేడు. మీ స్వభావాన్ని అనుసరించి మీరు సత్యాన్ని గ్రహించగలరు. మీ అంతకు మీరే కృషి చేయగలరు..... పరిపూర్ణ వ్యక్తు లవడానకి అందరూ తీవ్రప్రయత్నం చేయాలి. శక్తి సమన్వితులై, మీ పాదాల మీద మీరు నిలబడి స్వతస్సిద్ధమైన యోచన జరుపుతూ, ఆత్మసాక్షాత్కారం పొందండి. కారాగారంలోని యుద్ధ ఖైదీల మాదిరి బారులుతీరి నిలబడి, ఆ విధంగానే కూర్చుని, అందరూ ఒకే తీరు అన్నాన్ని మెక్కుతూ, ఒకే పర్యాయం తలలూపుతూ, వారిలా ప్రవర్తించవద్దు; ఇతరులు

www.ramkarri.com

www.ramkarri.com



అందించే సిద్ధాంతాలను దిగమ్రింగవద్దు. విభిన్నస్థితి జీవన లక్షణం; అవిభిన్నస్థితి మరణ చిహ్నం.

ఇతరుల నెవ్వరినీ అనుకరింప తలపకండి. మనం నేర్వవలసిన గొప్ప నీతిసారం ఇది. అనుకరణం నాగరకత కాదు... అనుకరణం, పిరికితనంతో కూడుకొన్న అనుకరణం ఎన్నడూ పురోగతికి దారితీయదు. ఇది దిగజారుడుతనానికి సూచిక... ఇతరుల నుండి మీరు నేర్వవలసింది నిజానికి ఎంతో ఉంది. క్రొత్తదాన్ని నేర్వ నిరాకరించే వాడు అప్పటికే మరణించినవాడు....ఇతరుల నుండి మంచినంతా నేర్చుకో! నీలోకి తీసుకో! నీకు స్వాభావికమైన మార్గంలో దాన్ని జీర్ణం చేసుకో! అంతేగాని పరుల వేషం మాత్రం వేయబోకు. ఈ భారతీయ జీవనమార్గం నుండి వైతొలగవద్దు; భారతీయు లందరరూ పరదేశీయుల వస్త్రధారణ, తిండి తినడం, ప్రవర్తించడం ఇత్యాదులు ప్రారంభిస్తే భారతదేశానికి మేలు జరుగుతుందని ఒక్క త్రుటికాలమైనా కూడా అపోహపడకు.

విత్తనం నేలలో నాటబడింది; మన్ను, గాలి, నీరు దాన్ని చుట్టువారి ఉన్నవి. ఆ విత్తనం మన్ను అవుతుందా, గాలి అవుతుందా లేక నీరు అవుతుందా? ఏదీ కాదు. అది మొక్క అవుతుంది. ఆత్మవికాస నియమానుసారం అభివృద్ధి పొందుతూ, గాలిని మన్నును నీటిని జీర్ణం చేసుకొని వాటిని వృక్షతత్త్వంగా మారుస్తూ – మొక్కగా పరిణమిస్తుంది. (అదే విధంగా) ప్రతి వ్యక్తీ ఇతరుల భావాలను గ్రహిస్తూ స్వకీయ వ్యక్తిత్వాన్ని నిలుపుకొని స్వీయవికాస నియమానుసారం పురోభివృద్ధి గాంచాలి.

www.ramkarri.com

www.ramkarri.com



# నైతికత అంటే ఏమిటి?

అన్ని శాస్త్రాలలో పరోపకార భావమే అత్యంత ప్రాముఖ్యాన్ని పొంది, కేంద్రస్థానం ఆక్రమించుకొని ఉంది. మానవ జీవితంలో ముఖ్యసూత్రంగా ఉండవలసింది భూతదయ (మానవుల పట్లా, జంతుకోటి పట్లా దయ). "నేనే ఈ జగత్తును. ఈ జగత్తంతా ఒక్కటే–" అనే పరమసత్యమే, వేర్వేరు ధర్మశాస్త్రాలలో వేర్వేరు విధాలుగా బోధింపబడి ఉందని చెప్పవచ్చు. కాకపోతే నేను ఇతరులకు ఎందుకు ఉపకారం చేయాలి? "చేయి" అని నన్ను బలాత్కరించేది ఏది? సానుభూతి, అంటే సర్వైక్యభావమే కదా? ఎలాటి కఠిన హృదయులకైనా, ఇతరుల పట్ల ఒక్కొక్కసారి జాలి కలుగుతుంది. తన వ్యక్తిత్వం భ్రాంతిజనితమైన మిథ్య అనీ, దాన్ని అంటిపట్టుకొని ఉండాలనుకోవడం అధముల లక్షణమనీ చెబితే భయపడేవాడు కూడా, స్వార్థత్యాగమే సన్మార్గ జీవన ముఖ్యసూత్రమని చెబుతాడు. కాని స్వార్థత్యాగం అంటే ఏమిటి? ఈ అసత్య వ్యక్తిత్వాన్ని పరిత్యజించడం, స్వార్థపరత్వాన్నంతా త్యజించడమే కదా? ఈ మమతాహంకారాలు, పూర్వపు మూఢ విశ్వాసాల ఫలం. ఈ మిథ్యా వ్యక్తిత్వం క్షీణించేకొద్దీ, నిజమైన వ్యక్తిత్వం వ్యక్తమవుతూ ఉంటుంది. అది ధర్మబోధకంతటికీ కేంద్రం, ఆధారం, సారభూతమూ అయిన స్వార్థత్యాగం. ప్రపంచమంతా –

www.Ramkarri.com



బుద్ధిపూర్వకంగానో, ఊరికేనో - ఈ స్వార్థత్యాగ లక్షణాన్ని కొద్దో గొప్పో ఆచరిస్తూ, దాని వైపుకు మెల్లగా సాగుతోంది. తాము ఇలా చేస్తున్నామని తెలియనివారు, మమతాహంకార మూలమైన వ్యక్తిత్వం భ్రాంతిజనితమని, పరిమితమని తెలిసికొని, ఈ స్వార్థత్యాగాన్ని బుద్ధిపూర్వకంగా చేయాలి. ఇప్పటి మనిషి అనంతరూపుడి యొక్క అంశ; సర్వమూ తానే ఐన ఆ అనంతవహ్ని యొక్క విస్ఫులింగం; అతని నిజ స్వరూపం అప్రమేయమూ, అనంతమూనూ.

ఇతరులకు మేలు చేయడం ధర్మం. ఇతరులకు కీడు చేయడం పాపం.

బలపౌరుషాలు ధర్మం. బలహీనత, పిరికితనం పాపం.

స్వాతంత్ర్యం ధర్మం. పరతంత్రత పాపం.

ఇతరులను ప్రేమించడం ధర్మం. ఇతరులను ద్వేషించడం పాపం.

భగవంతునిపై విశ్వాసం, ఆత్మ విశ్వాసం ధర్మం. సందేహించడం పాపం.

ఏకత్వాన్ని దర్శించడం ధర్మం. నానాత్వ దృష్టి పాపం. ధర్మప్రాప్తికి మార్గాలనే సకల శాస్త్రాలు తెలుపుతున్నాయి.

లోకంలో ఏ ప్రవక్త బోధించినా, ఏ మతం ఉపదేశించినా, ఏ భాషలో చెప్పినా సకల ధర్మాల సారం ఇదే. "నువ్వు నిస్వార్థుడవుగా", "నేను కాదు నువ్వే" - అనే నీతినియమావళుల వెనుకవున్న భావమదే. ఇదే సమస్త నీతిశాస్త్రానికీ పునాది. దీని అంతరార్థం పరిమిత వ్యక్తిత్వ

www.ramkarri.com

www.ramkarri.com



రాహిత్యాన్ని గుర్తించడమే – 'నీవు' 'నేను' ఒక్కరమే అని గ్రహించడమే. నీకు నేను హాని కలిగిస్తే, నాకు నేను హాని కలిగించుకోవడమే అనీ; నీకు నేను సహాయంచేస్తే, నాకు నేను సహాయం చేసుకోవటమే అని గుర్తించటం. నీవు జీవించి ఉండగా, నాకు మృత్యువు లేదని తెలుసుకోవటం. ఈ విశ్వంలో చిన్న పురుగు బతికివున్నంతవరకూ నేనెలా మరణించగలను? నా ప్రాణం ఆ పురుగుప్రాణంలో ఉంది కదా. అంతేకాక, మనం సహాయం చెయ్యక ఒక్కజీవిని కూడ విడిచిపెట్టడానికి వీలులేదనే విషయంకూడ అది బోధిస్తుంది. వాని క్షేమంలోనే నా క్షేమమూ ఉంది.

మనిషి నీతిమంతుడుగా, పవిత్రుడుగా ఎందుకు ఉండాలి? అది అతడి ఇచ్ఛాశక్తిని బలపరుస్తుంది కాబట్టి. నిజస్వభావాన్ని బహిర్గతంచేస్తూ, ఇచ్ఛాశక్తిని బలవత్తరం చేసే ప్రతి పనీ నైతికమే. తద్విరుద్ధమైనదంతా అవినీతే.

www.ramkarri.com

www.Kamkarri.com



# ఆదర్శాన్ని అంటిపెట్టుకొని ఉండు

కాబట్టి మొట్టమొదట కావలసిన లక్షణం - ఆశయ సిద్ధికోసం దృఢమైన కోరిక. మిగిలినదంతా తరువాత సులువుగా లభిస్తుంది... శ్రమపడి కృషిచెయ్యటం ముఖ్యంగా నేర్చుకోవలసిన గుణపాఠం. ఈ జీవితంలో మనం పొందదగ్గ మహత్తర ప్రయోజనం పోరాటమని గ్రహించండి. పోరాటం మూలంగానే మనం ముందుకు సాగిపోతున్నాం. స్వర్గానికి మార్గం ఏదైనా ఉంటే, అది నరకం ద్వారా పోవలసిందే. ఎప్పుడైనా సరే స్వర్గాన్ని నరకం ద్వారానే చేరుకోవాలి. పరిస్థితులను ఎదుర్కొని పోరాడుతూ మృత్యుముఖీనమైనా - దారిలో వెయ్యిసార్లు మృత్యుముఖీనమైనా పురోగమించడానికై నిర్భీతంగా మళ్లీ మళ్లీ ప్రయత్నం చేసేటప్పుడు ఆత్మ అతులిత శక్తిసంభరితమై బయల్వెడలుతుంది. అప్పుడది ఏ ఆదర్శాలను చేరడానికై తానింతకాలం పోరాడుతూ ఉందో ఆ ఆదర్శాన్ని చూసి- దానికంటే తానెంత ఘనతరమైనదో గ్రహించి - నవ్వుతుంది. ఆ ఆదర్శంకంటే తానెన్నిరెట్లు గొప్పదో అది గ్రహిస్తుంది. నేనే, నా ఆత్మే నా గమ్యం. మరేదీ గమ్యం కాబోదు. నా ఆత్మతో పోల్చదగింది మరేముంది? ఒక సంచి బంగారం నా ఆత్మకు ఆదర్శం కాగలదా? ఎంత మాత్రమూ కాదు! ఆశయా లన్నింటిలో నా ఆత్మే ప్రశస్తమైనది. నా యధార్థతత్త్వాన్ని సాక్షాత్కరింపచేసుకోవటమే - అదొక్కటే నా జీవిత పరమావధి.

www.ramkarri.com

www.Ramkarri.com



సంపూర్ణంగా 'చెడు' అనదగ్గది ఏదీలేదు. ఇక్కడ దేవుడికే గాక దయ్యానికి కూడా స్థానముంది. లేకపోతే అది ఇక్కడ ఉండనే ఉండదు. ఇంతకుముందే అన్నట్లు మనం స్వర్గానికి నరకంగుండా పోవలసిందే. మన తప్పులకూ ఇక్కడ తావుంది. ముందుకు సాగిపోండి! తప్పు పని మీరేదైనా చేశారనుకొన్నా వెనక్కు తిరిగి చూడొద్దు. మీరు తప్పులు చెయ్యని పక్షంలో ఇప్పటకి ఈ విధంగా ఉండివుంటారా? కాబట్టి మీ తప్పులను దీవించండి. అవి ప్రచ్ఛన్న దేవతలు. బాధలు ధన్యాలవనీ! సుఖాలు ధన్యాలవనీ! మీకెలాంటి పరస్థితి ఎదురైనా లెక్కచెయ్యవద్దు. లక్ష్యాన్ని అంటి పెట్టుకొని ఉండండి. ముందుకు సాగిపోండి! వెనక్కు తిరిగి చిన్నచిన్న తప్పులను, అల్ప విషయాలను చూసి కుంగిపోవద్దు. ఈ రణరంగంలో తప్పులనే దుమ్ము రేగవలసిందే! ఈ ధూళికి తాళలేని సుకుమారులను సైనికదళాల నుండి తొలగిపోనివ్వండి.

ఆదర్శం ఉండేవాడు ఒక వెయ్యి తప్పులు చేస్తే, లక్ష్యం లేనివాడు యాభైవేల తప్పులు చేస్తాడనడం నిస్సంశయం. ఈ లక్ష్యాన్ని గూర్చి సాధ్యమైనంత వినాలి. నిరంతర శ్రవణంవల్ల అది మన హృదయంలో ప్రవేశించాలి. మన బుద్ధికెక్కాలి. రక్తనాళాలలో దూరాలి. ప్రతి రోమకూపంలో వ్యాపించాలి. అంతటా మనం దాన్ని గూర్చి ధ్యానించాలి. "హృదయం భావభరితమైనప్పుడు నోరు మాట్లాడుతుంది." హృదయం భావ బంధురమైనపుడు? హస్తం కూడ పనిచేస్తుంది.

www.ramkarri.com

www.Kamkarri.com



మనల్ని కర్మాచరణకు పురికొల్పేవి భావాలే కాబట్టి, మనస్సును అత్యున్నత భావాలతో నింపుకోండి. ప్రతి రోజూ వాటిని గూర్చి వినండి. ప్రతి నెల వాటిని గూర్చి ఆలోచిస్తూ ఉండండి. అపజయాలను లక్ష్య పెట్టకండి. అవి కలగటం చిత్రమా? జీవితానికి అలంకారప్రాయాలు కదా అవి? అవి లేని జీవితమెంత మందకొడిగా ఉంటుంది. ఈ పోరాటలే జీవితానికి స్వారస్యమిచ్చేవి. అవే జీవిత సౌరభాలు కాబట్టి, ఈ పొరపాట్లను పోరాటాలను లక్ష్య పెట్టవద్దు. ఆవు అసత్య మాడదు. నిజమే, కాని అది ఎప్పటికీ ఆవే. మానవుడు కాజాలదు. కాబట్టి అపజయాలచే నిరుత్సాహమొందకండి.

లక్ష్యసిద్ధికై వేయిసార్లు పోరాడండి.

వేయిసార్లూ ఓటమి ప్రాప్తిస్తే, ఇంకోసారి మళ్లీ ప్రయత్నించండి.

అన్నిటిలో దైవాన్ని చూడటమే ఆదర్శం. కాని అన్నింటిలో చూడజాలకపోతే మీకు అత్యంత ప్రియమైన వస్తువులో మొదట చూడండి. ఆ తర్వాత మరొక దానిలో, తరువాత ఇంకొక దానిలో; ఇలా క్రమ వ్యాప్తిని పొందింపవచ్చు. ఆత్మకు జీవిత పరిమితి లేదు. దాని జీవితం అనంతం. కాబట్టి కాలం చాలదని భీతిల్లక సావకాశంగా సాధన సాగించండి. కార్యసిద్ధి చేకూరుతుంది.

ఒక భావాన్ని స్వీకరించండి. దాన్నే మీ జీవిత సర్వస్వంగా చేసుకోండి. దాన్నే మననం చేయండి. దాన్ని గురించే కలలుగనండి. దానిలోనే పరవశులై జీవించండి.

www.ramkarri.com

www.Ramkarri.com



మీ మెదడు, కండరాలు, నరాలు, శరీరంలోని ప్రతిభాగం కూడా ఆ భావంతో తన్మయం కావాలి. ఇదే కార్యసిద్ధికి దారి. ఈ విధానమే అలౌకిక గుణాఢ్యులైన ఆధ్యాత్మిక మహాత్ములను ప్రభవింప చేసింది. సాధనకు పూనుకోని వారంతా వదరుబోతులు.

'ఆచరణస్థాయి' లక్ష్యతీవ్రతపై ఆధారపడి ఉంది. మన జీవితాల్లోకి లక్ష్యం పూర్తిగా చొచ్చుకొనిపోయి ఉండాలి. మన జీవితంలో నిత్యం నిర్వహించవలసిన ధర్మాలను గూర్చి మనం విచారణచేస్తూ కూర్చున్నా లేక ఆచరణలో పెడుతున్నా ఈ లక్ష్యం మాత్రం మన దృష్టిపథంలో ఉండితీరాలి. ఈ లక్ష్యకిరణాలు ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని మన జీవితంలో ప్రసరించి దాన్ని కాంతిమంతం చెయ్యాలి. మనకు తెలియకగాని, తెలిసిగాని చేసే ప్రతి పనీ ఈ లక్ష్య కిరణ ప్రసారజన్య కాంతిలోనే నిర్వర్తించబడాలి. ప్రతి వస్తువు దీని కాంతిలోనే నయనగోచరం కావాలి, పరివర్తనం కావాలి. మన లక్ష్యాన్నిబట్టే మన పురోగతి. ఈ లక్ష్యంలో ఉన్న శక్తే మనలను అలముకొని ఉంది. మన సుఖదుఃఖాల్లో, మన ఉత్తమ–అల్ప కార్యాల్లో, మన గుణగణాల్లో ఈ లక్ష్య శక్తే ప్రకటీకృతమౌతూ ఉంటుంది.

www.ramkarri.com

www.Ramkarri.com



# ఏకాగ్రతాశక్తి

మనుష్యులకు జంతువులకు ప్రధానమైన భేదం వారి మధ్య ఉన్న ఏకాగ్రత శక్తిలోని భేదమే. ఏ కార్యరంగంలోనైనా సరే కలిగే విజయం తత్ఫలితమే. ప్రతి ఒక్కరికి ఏకాగ్రత గురించి కాస్తోకూస్తో తెలిసే ఉంటుంది. దాని ఫలితాలను నిత్యం మనం చూస్తునే ఉన్నాం. చిత్రలేఖనం, సంగీతం ఇత్యాది లలిత కళలలో సముపార్జించిన గొప్ప సాధనలు ఏకాగ్రతాశక్తి ఫలితాలే. జంతువుకు అత్యల్ప ఏకాగ్రతాశక్తి మాత్రమే ఉంటుంది. జంతువులకు శిక్షణనిచ్చి మచ్చిక చేసుకొనేవారికి, తాము వాటికి ఏం చెప్పారో అవి మరిచిపోతూ ఉండటం సువిదితమే. ఆ జంతువు తన మనుస్సును ఒకే విషయం పై చాలసేపు కేంద్రీకరించలేదు. ఇక్కడే మనిషికీ జంతువుకీ ఉన్న తేడా – మనిషి అధిక ఏకాగ్రతా శక్తిని సంతరించుకొన్నవాడు. ఏకాగ్రతాశక్తిలోని తారతమ్యమే మనిషికీ మనిషికీ కూడా వ్యత్యాసాన్ని కల్పిస్తుంది. అట్టడుగు వ్యక్తిని అత్యధికునితో పోల్చి చూడండి. వాళ్లిద్దరిలో కానవచ్చే వ్యత్యాసం వారిలోని ఏకాగ్రతాశక్తి పరిమాణంలోని వ్యత్యాసమే.

కొన్ని సందర్భాలలో ప్రతి వ్యక్తి మనస్సు ఏకాగ్రతను సంతరించుకొంటుంది. మనం ప్రేమించే వస్తువులపై మన దృష్టిని కేంద్రీకరిస్తాం, మన మనస్సు ఏకాగ్రం చేసే

www.ramkarri.com

www.Ramkarri.com



వస్తువులను మనం ప్రేమిస్తాం. తన అల్లారు ముద్దు బిడ్డడి ముఖారవిందాన్ని ప్రేమించని మాతృమూర్తి ఉంటుందా? ఆ బిడ్డడి ముఖం ఆమెకు ప్రపంచంలోనే అత్యంత సుందరమైనది. తన మనస్సును దానిపై కేంద్రీకరిస్తుంది కనుకే దానిని ఆమె ప్రేమిస్తుంది. ప్రతి వ్యక్తీ తన మనస్సును అదే ముఖంపై కేంద్రీకృతం చేస్తే, ప్రతి వ్యక్తీ దానిని ప్రేమిస్తాడు. సర్వులకూ అది అత్యంత సుందరమైన ముఖంగా విరాజిల్లుతుంది. మనం ప్రేమించే వస్తువులపై మన మనస్సులను ఏకాగ్రం చేస్తాం.

అటువంటి ఏకాగ్రతలలో ఎదురయ్యే చిక్కు మనం మనస్సును నియంత్రించ లేకపోవడమే; అదే మనలను నియంత్రిస్తుంది. మనకు బాహ్యంలోని దేదో మన మనస్సును ఆకర్షించి, మనస్సును దానిపట్ల ఇచ్ఛ వచ్చినంత సేపు పట్టి ఉంచుతుంది. మనం సుశ్రావ్య రాగాలు వింటాం లేక ఒక అందమైన చిత్తరువును తిలకిస్తాం, సత్వరం అది మనస్సును ఆకట్టివేస్తుంది! మనస్సును దాన్నుండి మరల్చలేం.

మీకు ఇష్టమైన అంశంపై నేను ప్రసంగిస్తే, మీ మనస్సు నా ప్రసంగంలో లీనమైపోతుంది. మీ ప్రమేయం లేకపోయినప్పటికీ మీనుండి మీ మనస్సును లాగివేసి నా ప్రసంగాంశంపై నిలుపగలను. ఆ రీతిలో మన ప్రమేయంతో నిమిత్తం లేకుండానే మన సావధానత కట్టువడి మన మనస్సులు వివిధ విషయాలపై ఏకాగ్రం చెందుతాయి. ఈ విషయంలో మనం నిస్సహాయులమే.

www.ramkarri.com

www.Kamkarri.com



ఇప్పుడు తలెత్తే ప్రశ్న -

ఈ ఏకాగ్రతను వృద్ధిపరచి మనం దానికి యజమానులం కాగలమా?

యోగులు 'అవును' అని అంటారు. మన మనస్సులను పరిపూర్ణంగా నియంత్రించవచ్చు అని అంటారు యోగులు. నైతికపరంగా చూసినప్పుడు ఏకాగ్రతాశక్తి పురోగతిలో ఒక అపాయం వాటిల్లవచ్చు. ఒక వస్తువుపై మనస్సును ఏకాగ్రం చేసి, ఇచ్ఛానుసారం మనస్సును దానినుండి విడదీయలేక పోవడమే ఆ అపాయం. ఈ పరిస్థితి ఎంతో యాతనకు గురిచేస్తుంది. దాదాపు మన కష్టాలన్నింటికీ హేతువు మనలో నిస్సంగత్వం లోపించడమే. కనుక నిస్సంగత్వంతో కూడిన ఏకాగ్రతను పెంపొందించుకోవాలి.

మన మనస్సును ఒక విషయంపై పరిపూర్ణంగా అనురక్తతను కలిగి ఉండటమే కాక, క్షణమాత్రాన దాన్నుండి విడివడచేసి మరో విషయంపై నిలుపగలగడం నేర్వాలి.

ఈ రెంటినీ కలిసికట్టుగా పెంపొందించుకోవడం సురక్షితం.

క్రమానుగుణంగా మనస్సును పెంపొందించు కొనే విధానం ఇదే. విద్య యొక్క సారాంశం - మనస్సును ఏకాగ్రం చేయడమే గాని విషయాంశాలను ప్రోగుచేసుకోవడం కాదు. మళ్లీ నేను విద్యాభ్యాసం చేయవలసివస్తే, నేను విషయాంశాలను అధ్యయనం చెయ్యను; నేను ఏకాగ్రతా శక్తినీ నిస్సంగత్వాన్నీ పెంపొందించుకొంటాను. పిదప ఒక పరిపూర్ణ

www.ramkarri.com

www.Kamkarri.com



సాధనంతో విషయాంశాలను ఇచ్చు మేరకు సేకరించుకొంటాను. పిల్లలలో ఏకాగ్రతాశక్తినీ నిస్సంగత్వాన్నీ ఏకకాలంలో పెంపొందింప చెయ్యాలి.

లోకంలో మనకు లభించే జ్ఞానమంతా చిత్త ఏకాగ్రత వల్ల కలిగిన జ్ఞానమే. ప్రయత్నించే పద్ధతిని తెలుసుకుంటే, సాధనావిధానాన్ని గ్రహిస్తే, లోకం తన రహస్యాలను వెల్లడించడానికి సిద్ధంగా ఉంది. ఇలాంటి సాధనకు కావలిసన శక్తి సామర్థ్యాలు ఏకాగ్రతవల్ల కలుగుతాయి. మనిషి సంకల్పశక్తికి పరిమితి లేదు. మనసు ఎంతగా ఏకాగ్రత చెందుతూ ఉంటుందో ఆ మేరకు విషయ పరిశీలనా శక్తి కలుగుతూ ఉంటుంది. ఇదే రహస్యం.

మనస్సును శిక్షణ పరచడం శ్వాసించడంతో ఆరంభమౌతుంది. నియమానుసార శ్వాసక్రియ దేహాన్ని సామరస్య స్థితిలో ఉంచుతుంది. పిదప మనస్సును చేరుకోవడం సులభమవుతుంది. శ్వాసక్రియను అభ్యసించడంలో మొదట తెలుసుకోవలసింది ఆసనం లేక భంగిమ. ఒక వ్యక్తి అనాయాసంగా కూర్చునే భంగిమయే అతడికి యుక్తమైన ఆసనం. వెన్నెముకను స్వేచ్ఛగా ఉంచాలి, దేహభారాన్ని ప్రక్క టెముకలు వహించాలి. ఏ ఉపాయాల ద్వారా మనస్సును నియంత్రించడానికి ప్రయత్నించరాదు; ఆవశ్యకమైనది సహజంగా శ్వాసించడం మాత్రమే.

www.Ramkarri.com



# సమతాభావనను పెంపొందించుకో

నువ్వు ఎవ్వరిపైనా జాలిపడకు. అందరూ, నీతో సమానులని భావించు. నీలోని అసమానదృష్టిని నిర్మూలించు. మనమందరం సమానులమే. కాబట్టి " నేను మంచివాడిని, నువ్వు చెడ్డవాడివి. నిన్ను నేను మార్చడానికి ప్రయత్నం చేస్తున్నాను" అని అనుకోరాదు. సమానత్వం అన్నది ముక్తజీవుల లక్షణం.

పాపాత్ములు మాత్రమే ఇతరులలో పాపాన్ని చూస్తారు.

మానవుని కాక, ఈశ్వరుణ్ణే చూడు. మన స్వర్గాన్ని మనమే నిర్మించుకొంటాం. నరకంలో కూడ స్వర్గాన్ని నిర్మించుకోవచ్చు.

పాపాత్ములు నరకంలోనే ఉంటారు. వారిని మన చుట్టూ ఉన్నట్లు చూస్తే మనంకూడ నరకంలో ఉన్నట్లే.

మనం చదువుకొని తీరాలి. ఈ రోజుల్లో ప్రజాస్వామ్యమని, సమానత్వమని అంటున్నారు. అందరితో తాను సమానుడే అని సామాన్యమానవుడు ఎలా గ్రహించగలడు? అతగాడి మెదడు బలమైందిగా ఉండాలి. అసంగతాలైన భావాలేవీ లేకుండా స్పష్టంగా ఆలోచించే మనస్సుండాలి. తన మనస్సుమీద తామరతంపరగా పెరిగిపోయిన మూఢవిశ్వాసాలను తొలగించుకొంటూ, తన అంతరంగంలోని సత్యాన్ని అతడు దర్శించ గలగాలి.

www.Kamkarri.com



అప్పుడతడు సమస్త పరిపూర్ణత్వం, సకల శక్తులూ తనలోనే ఉన్నాయని, ఇవి తనకు ఇతరులు ఇవ్వవలసినవి కావని తెలుసుకొంటాడు. అతడికి ఈ విషయం రూఢి అయిన తరువాత అతడు స్వతంత్రుడవుతాడు. సమానత్వాన్ని పొందుతాడు. తన మాదిరే ప్రతివ్యక్తీ తనతో సమానంగా పరిపూర్ణత్వం గలవాడే అని, అందువల్ల తన సోదరుల మీద తాను శారీరకంగా గాని, మానసికంగా గాని, నైతికంగా గాని ఆధిక్యతను చూపకూడదని కూడా గ్రహిస్తాడు. తనకంటే తక్కువ వ్యక్తి ఉన్నాడనే భావాన్ని అతడు విడిచిపెడతాడు. అప్పుడు మాత్రమే అతడు సమతను గురించి మాట్లాడవచ్చు.

www.ramkarri.com

www.Kamkarri.com



# స్వేచ్ఛగా ఉండు

ఇతర శరీరాలు నీవిగానే భావించడం నేర్చుకో; మన అందరం ఒక్కటే అని గ్రహించు. అనర్థాలైన ఇతర విషయాల నన్నిటిని తోసివెయ్యి. మంచివి కానివ్వు, చెడువి కానివ్వు – నీ కర్మలను కన్నెత్తి అయినా చూడబోకు, వాటిని స్మరించనే స్మరించకు. అయినదేదో అయింది – మూఢవిశ్వాసాలను విడనాడు. మృత్యుముఖంలోనైనా సరే దౌర్బల్యానికి అధీనుడవు కాబోకు.

పశ్చాత్తాపపడకు, అయిపోయిన కార్యాలను గురించి తలపోస్తూ ఉండకు; నీ సత్కార్యాలను స్మరించుకు. విముక్తుడవుగా ఉండు. దుర్బలులు, భయగ్రస్థులు, అజ్ఞులు – వీరెన్నడూ ఆత్మను పొందలేరు. కర్మఫలం కలిగి తీరుతుంది. నీవు దానిని అడ్డుకోలేవు. దానికి అభిముఖుడవై ఉండు. కాని చేసిన పాపాన్నే మళ్లా చేయకుండా జాగ్రత్తపడు. సత్కర్మఫలమైనా, దుష్కర్మఫలమైనా సమస్త కర్మఫల భారాన్ని భగవంతుడి మీద ఉంచు. దుష్కర్మలను మాత్రమే భగవంతుడికి సమర్పించి సత్కర్మలను నువ్వు ఉంచుకోవద్దు. పరిమితమైన తమ 'అహం'భావంతో ప్రయత్నించడాన్ని మానుకొన్న వారికే భగవంతుడు తోడ్పడతాడు.

నిస్సంగత్వాన్ని నువ్వు అలవరచుకొన్నప్పుడు నీకింక పుణ్యమూ లేదు, పాపము లేదు. 'మంచి' 'చెడు' అనే తారతమ్యాన్ని కలిగించేది స్వార్థపరత్వమే. ఈ విశ్వంలో

www.ramkarri.com

www.Kamkarri.com



దేనికైనా సరే నీ అంతట నువ్వు లోబడితేనే తప్ప... అది నిన్ను ప్రభావితం చేయలేదు. మానవుడి ఆత్మ వివేకహీనమై స్వాతంత్ర్యాన్ని కోల్పోతేనే తప్ప, అతడి ఆత్మపై ఏ శక్తీ ప్రభావం చూపలేదు. ఈ విషయం దుర్గ్రాహ్యమైనా కాలక్రమంలో నువ్వే తెలుసుకుంటావు. కాబట్టి నువ్వు నిస్సంగత్వంచే దేని ప్రభావాన్నీ నీ మీదికి రానివ్వకుండా జయించివేయి. నేను అనుమతిస్తే గాని నామీద ప్రభావం చూపే అధికారం దేనికీ లేదని చెప్పటం సులభమే. బాహ్యప్రపంచం తన మీద చూపే ప్రభావాలచే సుఖదుఃఖాలు పొందని వ్యక్తి... దేనిని గాని నిజంగా తన మీద ప్రభావం చూపనివ్వని వ్యక్తి యథార్థ లక్షణమేమిటి? అదృష్ట దురదృష్టాలచే మనస్సు మారకుండా ఉండమే అతడి లక్షణం. అన్ని పరిస్థితులలోను అతడు ఒకే విధంగా ఉంటాడు.

మనం ఆ అద్భుత సమత్వాన్ని, అభేదాన్ని అందుకొన్నప్పుడు పాపమని, అనర్థానికి కారణాలని ఇప్పుడు అనుకొంటున్న వాటిని చూసి నవ్వుకొంటాం. వేదాంతంలో దీనికే మోక్షమని పేరు. ఈ సమత్వం, అభేదం వర్ధిల్లటమే ఆ మోక్షాన్ని సమీపిస్తున్నా మనడానికి గుర్తు.

సుఖ–దుఃఖాలలో సమత్వం ఉండాలి.

జయ–అపజయాలలో సమత్వం ఉండాలి.

అలాంటి మనస్సు మోక్షాన్ని సమీపిస్తున్న దన దగుతుంది.

అనుకున్న వెంటనే ఇంద్రియాలతో మనస్సును కలపాలి; అలాగే మనస్సును వాటినుండి విడదీయ గలగాలి.

www.ramkarri.com

www.Kamkarri.com



ఇలాంటి సామర్థ్యం ఉన్న వ్యక్తికే ప్రత్యాహారం సిద్ధిస్తుంది. ప్రత్యాహారమంటే మనశ్శక్తులను ప్రోగు చేసుకోవటం, బాహ్యంగా వర్తించే మనోవ్యాపారాలను అరికట్టటం. మనస్సును ఇంద్రియదాస్యం నుండి విముక్తం చేయటం అని అర్థం. ఇలా చేసినప్పుడే మనకు నిజమైన సౌశీల్యం ఏర్పడుతుంది. అప్పుడే మనం స్వేచ్ఛకు చేరువ అవుతాం. అంతవరకూ కేవలం జడప్రాయ యంత్రాలమే.

వివేకి స్వాతంత్ర్యాన్ని కోరతాడు. ఇంద్రియ విషయాలన్నీ నిస్సారాలని అతడు గుర్తిస్తాడు. సుఖదుఃఖాలకు అంతులేదని తెలుసుకొంటాడు. ఎందరు ధనికులు క్రొత్త క్రొత్త సుఖాలు కావాలని తహతహలాడుతున్నారు? ఇప్పుడు ఉన్న సుఖాలన్నీ పాతపడిపోయాయి. కాబట్టి వారికి క్రొత్తరకమైన సుఖాలు కావాలి. క్షణకాలపు నరాల తృప్తికై ప్రతి రోజు వారెన్నెన్ని పిచ్చి వస్తువులను కనుగొంటున్నారో? ఆ తృప్తి కలిగిన వెంటనే దానికి విపరీత ఫలంకూడ ఎలా కలుగుతోందో మీరు చూడటం లేదా? ప్రజలలో అధిక సంఖ్యాకులు గొర్రెలమంద వంటివారు. ముందుపోతున్న గొర్రె గోతిలో పడితే, వెనుక వస్తున్న గొర్రెలు కూడా ఆ గోతిలోకే దూకుతాయి. వాటి మెడలు విరుగుతాయి. అదేవిధంగా సంఘంలోని ఒక పెద్ద, ఏ పని చేస్తాడో ఆ పనినే తక్కిన వారంతా గుడ్డిగా చేస్తారు. తామేమి చేస్తున్నదీ వారు ఆలోచించరు. ప్రాపంచిక విషయాలు అసారాలని గుర్తించడం ప్రారంభించగానే, తాము మాయ చేతి ఆటబొమ్మగా గాని,

www.ramkarri.com

www.Ramkarri.com



మాయాకర్షణలకు లోబడిగాని ఉండకూడదన్న భావం మనిషికి కలుగుతుంది. మాయకు లోబడి ఉండడం బానిసత్వం.

తనగురించి నాలుగు మంచి మాటలు వినినంతనే మనిషి సంతోషిస్తాడు; కటువైన మాటలు నాలుగు చెవిని పడగానే ఏడవ నారంభిస్తాడు. పట్టెడన్నానికి అతడు బానిస. కొద్దిపాటి గాలికి, గుడ్డకు అతడు బానిస; పేరుకు, ప్రతిష్ఠకు బానిస. ఇలా అతడు బానిసత్వపు కోరల్లో చిక్కుకొని ఉన్నాడు. ఈ బానిసత్వం అతని దివ్యత్వాన్ని కప్పివేసింది. మానవుడని మీరు పేర్కొనేది ఈ బానిసనే. ఈ బానిసత్వాన్ని గుర్తించినప్పుడు విముక్తికై తీవ్ర ప్రయత్నమొనర్చాలన్న కోర్కె కలుగుతుంది.

నిప్పుకణికను నెత్తిమీద పెట్టినప్పుడు దానిని త్రోసివేయడానికై మనిషి ఎంత అల్లాడిపోతాడో చూడండి. మాయకు తాను బానిసగా ఉన్నానన్న నిజం తెలుసుకొన్న వ్యక్తి కూడా బంధ విముక్తికై అంతగా పరితపిస్తాడు.

విముక్తిని పొందిన తరువాత మనిషి ఏ వ్యక్తిత్వాన్ని అయినా స్వీకరించవచ్చును. అప్పుడు మనం నాటకరంగంలో బిచ్చగాని పాత్ర ధరించిన నటునిలాగా ఉంటాం. వీధుల్లో తిరిపెమెత్తే బిచ్చగానికీ, ఆ నటునికీ ఉన్న భేదం గూర్చి ఆలోచించండి? స్థలమొకటే కావచ్చు. దుస్తులూ ఒక్కరీతే కావచ్చు, కాని నిజంగా, ఎంత భేదముందో చూడండి! ఒకనికి దారిద్ర్యం వినోదం అయితే, రెండవవానికి ఎంతో దుఃఖం

www.ramkarri.com

www.ramkarri.com



కలిగించేది. ఈ భేదానికి కారణమేమిటి? ఒకడు స్వతంత్రుడు, రెండోవాడు కట్టుబడ్డవాడు (బద్ధుడు). నటునికి తన దారిద్ర్యం సత్యం కాదనీ, తాను నటన కోసం ఆరోపించుకొన్నదే అనీ తెలుసు. రెండోవానికో అది తన నిత్యదశే అనీ, తనకు ఇష్టమున్నా లేకున్నా, దాన్ని అనుభవించే తీరాలనీ తెలుసు. ప్రకృతి ధర్మం ఇలాంటిది. మన నిజస్వభావాన్ని గ్రహించేటంత వరకు మనం బిచ్చగాండ్రమే. ప్రకృతిలో ప్రతిదానిచేతా, ఇటూ అటూ తన్నులు తింటూ ఉండవలసిందే. సృష్టిలోని ప్రతిదానికీ దాస్యం చేయవలసిందే. సహాయం కోసం ప్రాకులాడుతూ ప్రపంచమంతా తిరగవలసిన వాళ్లమే. అయినా, సహాయం మాత్రం ఎక్కడినుండీ లభించదు. లేనిపోని వారినెవరినో కల్పించుకొని, వారి దగ్గర మొరపెట్టుకొంటూ ఉంటాం. కాని అది నిరుపయోగం. ఇంకా అది లభిస్తుందనే పేరాశ వదల్లేక, ఏడుస్తూ, దేబరిస్తూనే ఉంటాం. ఇలా ఒక జన్మ గడుస్తుంది; ఇంకొకటి వస్తుంది; కాని మళ్లీ వెనుకటి ఆటే సాగుతూ ఉంటుంది.

www.ramkarri.com

www.ramkarri.com



# ముందుకు సాగు!

మీలో ఎవరైనా ఈ శాస్త్రాన్ని తెలుసుకోదలిస్తే, అతను జీవన వ్యాపారం అనే కార్యరంగంలోకి ఎంత మనో నిశ్చయంతో దిగుతాడో, అంతకు మించిన మనోనిశ్చయంతో దీనికి పూనుకోవాలి.

ఈ జీవన పోరాటానికి ఎంత శ్రద్ధ కావాలో! ఎంత కష్టపడాలో! తండ్రి మరణించినా, తల్లి, భార్య, చివరికి పిల్లలు కూడా మరణించినా ఈ పోరాటం మానుకోవటానికి వీలులేదు. గుండెలు పగులుతున్నా మనం కార్యాన్ని నిర్వహించాల్సిందే! అది తప్పనిసరి అనీ, అలా చేయటమే సరైన పద్ధతని మనం అనుకొంటాం కదా!

ఈ వ్యాపారాలన్నింటికన్నా ఎక్కువ శ్రద్ధ యోగాభ్యాసానికి అవసరం. వ్యాపారంలో చాలామంది రాణింపవచ్చు. కాని యోగంలో కొంతమందే రాణిస్తారు. ఎందుకంటే, యోగాభ్యాసం చేసే వ్యక్తి యొక్క శారీరక - మానసిక నిర్మాణాలపై అతని సిద్ధి ఆధారపడి ఉంటుంది. వ్యాపారంలో అంతా లక్షలు సంపాదించలేరు. యోగంలో కూడా అంతే. ప్రతి సాధకుడు ఏవో కొన్ని వెలుగు రేఖలను చూస్తాడు. ఆ వెలుగురేఖ, యోగశాస్త్ర సత్యాన్ని గూర్చి - యోగసిద్ధిని పరిపూర్ణంగా సాధించిన వారున్నారన్న దాన్ని గూర్చి దృఢవిశ్వాసం కలిగిస్తుంది.

www.ramkarri.com

www.Ramkarri.com



చాలా చిన్న పనైనా, సవ్యంగాచేస్తే మహోద్భుత ఫలాన్నిస్తుంది. కాబట్టి ప్రతివాడూ తాను చేసేది చిన్నపనైనా, శ్రద్ధతో నిర్వహించాలి! బెస్తవాడు సైతం, తాను ఆత్మస్వరూపినని భావిస్తే, తన బెస్తవృత్తిలో ఉత్తముడుగా అవుతాడు. విద్యార్థి తాను ఆత్మరూపినని భావిస్తే చాలా శ్రేష్ఠుడైన విద్యార్థి అవుతాడు. న్యాయవాది, తాను ఆత్మయే అని భావిస్తే శ్రేష్ఠతమ న్యాయవాది అవుతాడు. ఇలాగే ఇతరులు కూడా.

ధీరుడవై సాగిపో! ఎన్ని ఆటంకాలు ఎదురైనా వెనుకకు తగ్గవద్దు. ఈ సుఖదుఃఖాలతో ఈ తనువు ఎన్నాళ్లుంటుంది? నీకు మానవదేహం లభించినందుకు అంతరాత్మను మేల్కొల్పి – "నేను భయరాహిత్యస్థితిని పొందాను" –అని చెప్పు!....తర్వాత ఈ శరీరమున్నంతవరకు ఈ నిర్భయ సందేశాన్ని ఇతరులకు అందిస్తూ ఉండు.

'తత్త్వమసి' "అది (ఆ దైవం) నీవే అయి ఉన్నావు".

లే! మేల్కో! గమ్యం చేరేవరకు ఆగకు.

ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్నిబోధత!



www.ramkarri.com

www.Ramkarri.com



"I will drink the ocean" says the persevering soul, "at my will mountains will crumble up". Have that sort of energy, that sort of will, work hard, and you will reach the goal.

"నేను సముద్రాన్ని ఆపోసన పడతాను", "నేను సంకల్పిస్తే కొండలే పిండి అవుతాయి" – అని కార్యశూరులు అంటారు. అటువంటి శక్తి, సంకల్పాలతో అవిశ్రాంతంగా శ్రమించినప్పుడు గమ్యాన్ని చేరితీరతావు.

www.ramkarri.com



Let him who has courage in his mind, love in his heart, come with me.

మనస్సులో ధైర్యం, హృదయంలో ప్రేమ ఉన్నవారు నన్ను అనుసరించండి.



www.ramkarri.com